# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యములు.

ప్రతి 1-కి రూ

అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో

ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ...

ఆంధ్రభాగవతము, పద్యకావ్యము ...

„ ఉత్తమప్రతి, 2 సంపుటములు ...

ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ...

„ టీక ...

ఆంధ్రభారతము, పద్యకావ్యము:—

ఆది సభాపర్వములు గల సంపుటము ...

ఆరణ్యపర్వము ... (అ

విరాటోద్యోగపర్వములు ... (అ

భీష్మద్రోణపర్వములు ...

కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ...

శాంతిపర్వము ...

అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక,

స్వర్గారోహణపర్వములు ...

ఆదిపంచకము, ఒకటేసంపుటము ... (అ

యుద్ధపంచకము, స్త్రీపర్వము ...

శాంతిసప్తకము ...

ఆనందరంగరాట్ఛందము ... 1

ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు,

క్యాలికో బైండు ... 1

ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము ... 3

ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... 1

శివికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) ...

కాశీఖండము, శ్రీనాథకవి ...

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు | అచ్చు | |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి ... | 2 | 0 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 2 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము | 2 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము | 1 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 1 | 0 |
| „ క్యాలికోబైండు ... | 1 | 8 |
| „ వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| „ క్యాలికోబైండు ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 1 | 4 |
| „ సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | 2 | 0 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి ... | 3 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 6 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 3 | 0 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు ... | 3 | 0 |
| „ II „ ... | 3 | 0 |
| „ III „ ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I „ ... | 3 | 0 |
| [illegible]థరామాయణము, ద్విపద ... | 5 | 0 |

ప్రతి 1-కి రూ.

రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము ... 3
లంకావిజయము (రావణదమ్మీయము) సటీక ... 1
వసుచరిత్రవిమర్శనము ... 1
వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము ... 7
వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ ... 1
విక్రమార్కచరిత్ర, జక్కనకవిది ... 1
విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము ... 3
వివేకసింధు, శ్రీకొండనార్యప్రణీతము ... 1
వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ ... 2
వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము ... 1
వీరభద్రవిజయము, పోతనకృతము ... 2
శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... 1
శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము ... 1
శృంగారనైషధము, శ్రీనాథకవిది ... 2
శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి ... 1
శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య ... 1
శుకసప్తతి, కదిరీపతికృతము ... 1
సమీరకుమారవిజయము, నూతనముద్రితము ... 1
సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము ... 1
సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము ... 5
„ అట్టబైండు ... 3
సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) 1
హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ ... 6
హరవిలాసము, శ్రీనాథకవి ... 1
హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ... 1
హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్న

శ్రీ ర స్తు.

# అ ని రు ద్ధ చ రి త్ర ము.

(అబ్బయామాత్యప్రణీతము).



శ్రీరస్తు

# అనిరుద్ధచరిత్రము.

## పీఠిక.



నిత్యోత్సవమందిరంబు లగులక్ష్మీమోహనాపాంగ వీ
క్షానీలోత్పలమాలికావళులు శృంగారంబుగా నంగపూ
జానైపథ్య మెలర్పఁ దత్తనులతాసంశ్లిష్టకేళిం బ్రియా
నూనుండై తగుమంగళాచలనృసింహుం డిచ్చు మాకోరికల్. 1

చ. సరసతఁ గౌఁగిలింప గిరిజాకుచపాళి నిజాంగలిప్తభా
సురభసితాంత మై కులుకుచున్ వెలిదామరమొగ్గజోడు సుం
దరత వహించుచుండ మమతం బలుమాఱును జూచి సౌఖ్యశం
కరుఁడు ప్రసన్నుఁడై యొసఁగుఁ గావుత మాకు నభీష్టసంపదల్. 2

మ అకలంకం బగుచిత్తశుద్ధికొఱకై యశ్రాంతమున్ మ్రొక్కెదన్
సకలస్థావరజంగమాత్మకజగత్సంసారనిర్మాణక
ర్తను నానాదురితాపహర్తను సమస్తామ్నాయసంధర్తనున్
బ్రకటస్వార్త మనోవిహర్తను వాక్పద్మేక్షణాభర్తనున్. 3

చ. కలిమికిఁ బుట్టినిల్లు సురకన్యల కేలికసాని ముజ్జగం
బులను గన్నతల్లి కృతపుణ్యులకున్ ధనధాన్యరాశి వి
ద్యలచెలి కత్తగారు కలశాబ్ధికిఁ గూరిమిపట్టి శౌరికిన్
గులసతి యాదిలక్ష్మి దయగుల్కెడు చూపుల మమ్ముఁ బ్రోవుతన్. 4

శా. శ్రీవిద్యాబగళాముఖీ భగవతీ చింతామణీ శ్యామలా
దేవీ వశ్యముఖీ సమాహ్వయములన్ దీప్యన్మహామంత్రతం
త్రావిర్భూత నిజాంశ లాశ్రితుల కిష్టైశ్వర్యముల్ చేయఁ జి
ద్భావాకారత నొప్పు శాంభవి ననున్ బ్రహ్మజ్ఞానాన్వితుం జేయుతన్. 5

చ. రసరమణీయకేళిసుకరంబు నభీష్టఫలోదయంబు మా
ర్దవసుమగంధయుక్తము సుధాసమవర్ణముగల్గి పర్ణినీ
యవిబుధలోకకల్పతరువై తగుపద్మజురాణి వక్త్రనో
త్సవము వహించు(గాత నిరతంబునుమద్రసనాంచలంబునన్. 6

ఉ. అంబుజగర్భనిర్జరవరాదులచేత సపర్యలందు హే
రంబుఁ గృపావలంబు మునిరాణ్ణికురుంబమనోంబుజాతరో
లంబు దరస్మితాననకళాజితశారదచంద్రబింబు భూ
షాంబరరుగ్విడంబు విజితారికదంబు భజింతు విద్యకై. 7

మ. దినరాత్తేజులఁ గాళిదాసు భవభూతిన్ దండి బాణున్ మయూ
రుని శ్రీహర్షుని సోము భారవిని జోరున్నన్నపన్ దిక్కశ
ర్మను శ్రీనాథుని సోము భీమకవి నెఱ్ఱాప్రెగ్గడన్ భాస్కరున్
వినుతింతున్ హరిభక్తినిష్ఠుల మహావిద్వత్కవిశ్రేష్ఠులన్. 8

చ. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరి సొమ్ముగాదు భా
రతిదయ సౌధవార్ధికవిరాజుల మానసముల్ ఘటంబు లా
యతము కొలంది లబ్ధమగు నయ్యమృతం బటుగాఁ దలంచి య
ద్యతన కవీంద్రులార కృప దప్పక మత్కృతి నాదరింపుఁడీ. 9

తే. కాళిదాసాదులకునైనఁ గలవుతప్పు
లనిరి పెద్దలు మాదృశులనఁగ నెంత
తప్పు గల్గిన దిద్దుఁడీ యొప్పుగాను
బాలునకు బుద్ధి నేర్పినభంగి గవులు. 10

తే. భగవదర్పితకావ్యంబుపట్ల నెరసు, లున్న దూషింప వలదు మాయన్నలార
ఘనకిరీటంబు ధరియించుకొనిన తలకు, సుల్లిలెక్కలు పెట్టుట చొప్పుగాదు. 11

చ. సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగబోరు మ
త్కుకవితతుల్ ప్రణంబు పరికించుగతిం గొదవల్ గణించుటల్
కుకవుల నైజబుద్ధి తెరలో కథచొప్పున బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమ లుండవె పెక్కులు వెక్కిరించుచున్. 12

వ. అని యిట్లు ప్రధానదేవతానమస్కారణంబును బురాతనాద్యతనసుకవిపురస్కారణం
బును గుకవి తిరస్కారణంబును గావించి యనంతరంబ. 13

సీ. శ్రీమంగళాద్రి లక్ష్మీనృసింహుల కటాక్షాంచలామృతవృష్టి నంకురించి
సంగీతసాహిత్యసరససౌష్ఠవయుక్తి శాఖోపశాఖలఁ జాలఁ బ్రబలి

రసికరాజన్యముఖ్యసమాజబహుమానసతతవసంతాభిరతిఁ జిగిర్చి
దైవనామాంకితస్తవమనోహరభావపదవాక్యసుమములఁ బరిమళించి
యభినవస్థితిఁ బెంపొందు నస్మదీయ, భాగధేయసారస్వతపారిజాత
తరువునకుఁదగు సత్ఫలోదయము గాఁగ, సముచితంబుగ నొక ప్రబంధమురచింతు.

క. చదువులకు మేర యెయ్యది, చదివినమాత్రంబె చాలు సరసవచస్సం
పదఁ దానేర్చిన కొలఁదిని, యదనఁగవితఁ జెప్పి హరికి నర్పింపఁ దగున్. 15

మ. అతి దాక్షిణ్యుఁ డతండు పూర్వకవికావ్యప్రౌఢ వాచారసో
న్నతులం దేలినఁ దేలుఁగాక యెపుడున్ నావంటికించిజ్జ్ఞుచేఁ
గృతి విశ్వాస మెఱింగి చేకొనియెడున్ శృంగారపద్వల్లవీ
రతులం జొక్కియుఁ గుబ్జమేను నగమీఁదన్ దీర్చి చేపట్టఁడే. 16

క భగవంతుని సద్గుణములు, పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు, జగతిన్ సత్కవులు తుచ్ఛసంపదకొఱకై. 17

మ. హరినామాంకితకావ్యమెట్టిదయిన న్నానందమై సజ్జనా
దరణీయం బగుఁబుష్పమాలికలలో దారంబు చందంబునన్
నరనామాంకితమైనకావ్యము రసౌన్నత్యస్థమయ్యు న్నిరా
కరణంబై చను హీనజాతిపురుషుం గైకొన్న వేశ్యంబలెన్. 18

చ. కృతులు నిజాంకితంబు లొనరించిన నిష్టధనంబు లిచ్చి స
న్మతిఁ బ్రభువుల్ కవీశ్వరుల మన్ననసేయుట కీర్తిఁగోరి ని
శ్చితమతి దేవతాస్తుతియె సేయుకవీంద్రుల నాదరించి స
త్కృతి యొనరించు సత్ప్రభుని కీర్తికిఁ గీర్తి ఘటింపకుండునే. 19

వ. అని తలంచి యొక్కనాఁటి రాత్రియందు నాయిష్టదైవం బైన శ్రీమంగళాచలనృ
సింహదేవు దేవాలయంబునకుం జని వివిధమణిగణవిరాజితంబును, ప్రదీప్తహాటక
మయంబునునై నయనారవిందంబులకు నూతనంబైన యానందవికాసంబు సంపా
దించుచున్నగోపురప్రాకారశిఖరగర్భగృహాంతరాళికాముఖమండపప్రభాసౌభాగ్యం
బులవలోకించి యాశ్చర్యంబునొందుచుఁ బ్రదక్షిణంబులుచేసి స్వామిదర్శనంబు
సేయుచు నుత్సాహంబున నంతర్గృహంబున కరిగి యందు. 20

సీ సంపూర్ణపూర్ణిమాచంద్రబింబమువంటి మోమునఁ జిఱునవ్వు మొలకలెత్త
నంకపీఠమున సుఖాసీనయైయున్న కమలావిలాసవిభ్రమ మెసంగ
శంఖచక్రగదాబ్జసంశోభితములైన బాహాచతుష్టయప్రభలు నిగుడ
గ్రైవేయమకుటకంకణకుండలాంగదహారావళులు మేన నందగింప
బాలికాహస్తపంకజాలోలచారు, చామరానిలమోదితస్వాంతుఁ డగుచు
దివ్యసింహాసనంబునఁ దేజరిల్లు, మోహనాకారు నరసింహమూర్తిఁ గంటి. 21

క. కని సాష్టాంగముగా వం, దనములు గావించి లేచి తత్సామీప్యం
బున నిలిచి కొలిచియుండఁగ, ననుఁ జల్లనిచూడ్కిఁ జూచి నయముగఁ బలికెన్.

క. బాలత్వమందె నీవు ద, యాళుఁడవై యొసఁగితిన్ సుదర్శితకవితా
ఖేలనమును మద్భజనా, శీలంబును దృఢముగాఁగఁ జేసితి వత్సా. 23

క. అనిరుద్ధచరిత్రముఁ జ, క్కనిముచ్చట విస్తరించి కడఁగి ప్రబంధం
బొనరింపుము శ్రేయోవ, ర్ధనమగు మాపేర నంకితము సేయుఁ దగన్. 24

వ. అని పలికినఁ బరమానందభరితహృదయుండనై తద్వచనంబు మహాప్రసాదంబుగా నంగీకరించుకొని యిట్లంటి. 25

ఉ. ఓకమలామనోరమణ యో పరమేశ్వర యో జగత్పతీ
యో కరిరాజదైన్యహర యో శరణాగతవజ్రపంజరా
యో కరుణారసామృతపయోధి పునర్జననంబుమాన్పి సౌ
ఖ్యాకరమైనసత్పదము నందఁగఁజేసి కృతార్థుఁ జేయుమీ. 26

వ. అని పునఃపునఃప్రణామంబులుచేసి తదనుజ్ఞవడసి యందుండి మరలి గృహంబునకు వచ్చితి నని యాదృశంబైన స్వప్నంబుఁ గాంచి మేల్కని యపరిమితప్రమోదరసమగ్నాంతరంగుండనై కొంతదడవు తదీయ దివ్యమంగళవిగ్రహంబు భావించుచుండితి నివ్విధంబునఁ దదనుగ్రహంబు వడసినవాఁడనై యేతత్ప్రబంధరచనాక్రమంబునకు నుపక్రమించి మద్వంశప్రకారంబు వర్ణించెద. 27

సీ. శుభకరాపస్తంబ సూత్రుండు కౌండిన్య గోత్రుండు నార్వేల కులపవిత్రుఁ
డగు బసవన మంత్రి కమురప్పమ్మన పెద్దన యెల్లప్ప ప్రియతనూజు
లాకుమారచతుష్టయంబులో ముఖ్యనామాత్యుండు సత్కీర్తిమండనుండు
తత్తనూజాతుఁ డుత్తమధర్మశీలుండు నిర్మలచరితుండు నిమ్మనాఖ్యుఁ
డతని నిజసాధ్వి యగుకొండమాంబగర్భ, మందుజనియించె వినయవిద్యాధనుండు
హరిహరధ్యానసేవాపరాయణుండు, మహితగుణశాలి యబ్బయామాత్యమౌళి. 28

ఉ. నిండుమనంబు సత్యమును నీతియు శాంతముగల్గి కీర్తివం
తుండయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటి భూ
మండల నాయకుల్ మిగుల మన్ననసేయఁగఁ బెంపుమీఱె స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తిపురాన్వయ వార్ధిపూర్ణచం
ద్రుం డని లోకులందఱు నెఱుంగుటకున్ నుతిసేయనేటికిన్. 29

తే. అమ్మహాత్ముని గేహిని యైనపుణ్య, వతికి లక్ష్మాంబ కుదయించె సుతయుగంబు
మహితగుణశాలి రాయన మంత్రివరుఁడు, నరుపమగుణోజ్జ్వలుం డగునిమ్మఘనుఁడు.

క. ధీనిధిరాయనమంత్రికి, మానవతీమణికి నరసమాంబకు జననం
బైనారమిరువురమె యో, గానందుఁడు నబ్బనార్యుఁ డనదఁగు నేనున్. 31

క. నరసింహపాదభక్తుఁడ, నరసింహకృపాప్రసాదనయలబ్ధమతిన్
నరసింహార్పితహృదయుఁడ, నరసింహునికరుణఁజాలనమ్మినవాఁడన్. 32

వ. ఇట్టి నా చేత విరచనీయంబగు నేతత్ప్రబంధసామ్రాజ్యంబునకు మూర్ధాభిషిక్తుండగు మహానుభావుని ప్రభావంబు వర్ణించెద. 33

సీ. శ్రీవైష్ణవాలయశ్రేణులందుఁ జెలంగు ద్రావిడగ్రంథనాదములవలన
వరమహీసురయజ్ఞవాటికాంతరములఁ గొమరారుహోమధూమములవలన
విపణివీథులయందువినిహితంబైనట్టి ధనధాన్యముఖపదార్థములవలన
నేలాలవంగతాంబూలవల్లీచందనముఖశోభితవనాంతములవలనఁ
గమలకైరవకల్హారకలితలలిత, విమలజలసాంద్రకాసారవితతివలన
భాసురంబగులక్ష్మీనివాసమగుచు, దివ్యతిరుపతిమంగళప్రస్థలంబు. 34

క. తిరుపతులునూటయెనిమిది, పురుషోత్తమశేషశైలములు మొదలుగ నా
తిరుపతులలోన మంగళ, గిరి విష్ణునిజస్థలంబు కేవలమరయన్. 35

మ. జగదానందకరంబు మోక్షపదవీసోపానమార్గంబు యో
గిగణాకర్ణగుహాంతరంబు శిఖరక్రీడావిలోలాప్సరో
మృగనేత్రాసుకరాంగుళీచలితతంత్రీవాతవీణారవా
నుగుణాంచత్పికనాదమద్రి చెలువొందున్ మంగళాఖ్యాతన్. 36

ఉ. ఆమహనీయశైలశిఖరాగ్రమునందు నృసింహమూర్తి తే
జోమయదివ్యవక్త్రమునశోభిలుచున్ నిజభక్తకోటి శ్ర
ద్ధామతిఁ జేయుపానకముఁదానెలమిన్ సగమారగించి తి
త్కామితముల్ ఫలింపఁగసగంబుఁదగన్ దయసేయువారికిన్. 37

చ. గిరిదిగువన్ వినూత్నమణికీలితమంటపమధ్యభాగభా
సురతరపీఠమందునతిసుందరమూర్తిధరించియిందిరా
తరుణియుఁదానునుండునిరతంబు నృసింహుఁడుదివ్యహారనూ
పురకటకాంగుళీయకవిభూషణపుంజవిరాజమానుఁడై. 38

తే. ఇట్టిమంగళగిరియందు నెగువదిగువ, తిరుపతులగంటిమధ్యప్రదేశమందు
శంకరుఁడుసర్వమంగళాసహితుఁడగుచు, నుండునెప్పుడుసహవాసయోగ్యుఁడగుచు.

సీ. కళ్యాణసరసిలోఁగదిసిమజ్జనమాడి ధౌతవస్త్రంబులందముగఁదాల్చి
కుధరాగ్రమెక్కి మార్కొండలక్ష్మిభజించి నరసింహునకువందనములుచేసి
మిరియంబులేలకుల్ మెదిపిచక్కెరతోడఁ గలిపితియ్యనిపానకములుచేసి
స్వామికర్పించిశేషంబైనసగమును భక్తులకెల్లనుబంచిపెట్టి
నగముదిగివచ్చిశివదర్శనంబుచేసి, దిగువనరసింహునిందిరాదేవిఁగొలిచి
భోగమోక్షంబులనుభవింపుదురుజనులు, సత్యమిదిమంగళాచలస్థలమునందు. 40

సీ. వేంకటాచలమున వేసటనొందక వడలుభుజింపఁగాఁబొడమదప్పి
శ్రీరంగమున నాసతిఅంగఁబొంగళ్లు భోజనంబొనరింపఁబొడమదప్పి
కాంచీపురంబులోఁ గాంక్షదొద్దినిఁజేరి యిడ్డెనల్ భక్షింపనెసఁగుదప్పి
యళగిరిస్థలమునఁ నాపోఁవగాదోసె లారగించునఁబుట్టినట్టిదప్పి
యర్చకస్తోమహస్తశంఖాగ్రముక్త, లలితగుడజలధారాఘుళంఘుళాయ
మానపానీయమహిమచేనఁణఁచికొనుచు, జలజనాభుండుమంగళాచలమునందు. 41

ఉ. ముంగిటికల్పభూరుహము మూలధనంబు నివేశనంబులోఁ
బంగరువాన చేతికగపడ్డతలంపులమానికంబుముం
గొంగుపసిండి భక్తులకుఁ గోర్కులపంట జగంబులందు మా
మంగళశైలవల్లభుసమం బగుదైవము లేదు చూడఁగన్. 42

## షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధకల్యాణగు, ణోదారప్రాభవునకునుద్యల్లీలా
సాదరకటాక్షవీక్షా, పాదితవిబుధేంద్రకమలభవవిభవునకున్. 43

క. అతులితమతియుతనుతగుణ, యతికృతసుధ్యానగతనిరాకారునకున్
శ్రితకమలాసితకమలా, యతవిమలాంబకసుఖప్రదాకారునకున్. 44

క. భూపాలంకారునకును, దోషాటభటచ్ఛటామదోత్కటగజహృ
ద్భీషణకంఠీరవగళ, ఘోషితకృతపాంచజన్యఘూంకారునకున్. 45

క. మందారకుందచందన, మందస్మితసుందరైకమందిరనయనా
నందపదనారవిందున, కుందామరసోద్భవాస్యకుముదేందునకున్. 46

క. పరసుగుణభక్తజనకృత, సరసగుణాంభోర్ధపానసౌఖ్యునకుశుభా
కరమంగళాచలస్థల, నరసింహాఖ్యునకుసద్గుణశ్లాఘ్యునకున్. 47

## కథాప్రారంభము.

వ. అంకితంబుగానేరచియింపంబూనిన యనిరుద్ధచరిత్రంబునకుఁ గథాప్రకారం బెట్టి దనినభగవత్కథాసుధానుభవకుతూహలసాంద్రులగు శౌనకప్రముఖమునీంద్రులుసకల పురాణేతిహాసప్రసంగవచనచాతురీవిఖ్యాతుండగు సూతునింగనుంగొని యిట్లనిరి.

చ. జలజభవాభవప్రముఖసంస్తవనీయవిశేషవిష్ణుని
ర్మలగుణకీర్తనామృతముమాకుకర్ణరసాయనంబుగాఁ
బలుమఱునీవుదెల్పుటకుఁబాత్రులమైతిమిపూర్వపుణ్యముల్
ఫలితమునొందెనీవలనభవ్యగుణాగ్రణి రౌమహర్షణీ. 49

క. అనిరుద్ధునిచారిత్రము, వినుటకుమాహృదయములువేడుకపొడమెన్
వినుపింపుసవిస్తరముగ, వినుతబుధవ్రాతసూతవినయోపేతా. 50

వ. అనిన విని యమ్మునీంద్రుల కతం డిట్లనియె. 51

క. మీరడిగినసత్కథ వినఁ, గోరి పరీక్షిన్మహీపాలకుంజరుఁ డడుగన్
ధీరుఁడు శుకయోగి సవి, స్తారంబుగఁ దెలుపఁదలఁచి తా నిట్లనియెన్. 52

సీ. ప్రాకారగోపురప్రాసాదసద్మరాగప్రభాచుంబితగగనతలము
సంతతఫలపుష్పసాంద్రనానావిధోర్వీరుహాకలితశృంగారవనము
చంద్రకాంతోపలసోపానకలితశోభితజలపూర్ణవాపీవ్రజంబు
సరససౌందర్యలక్షణలక్షితాకారభామినీపురుషసౌభాగ్యకరము
తే. గంధసింధురసైంధవబంధురంబు, సారసారససరసకాసారవిసర
మలఘుజలనిధిపరిఖాసమావృతంబు, పుణ్యనిలయంబు ద్వారకాపురవరంబు. 53

ఉ. లోకములన్నియుం దనకులోనుగనుండఁగఁ దన్నులోనుగాఁ
బైకొనెఁ జక్రవాళమని పావకసన్నిధిఁ దాఁ దపంబు ర
త్నాకరమాననగ్గిరి తదావరణావృతిఁ జేసినిల్చెనో
కాకయజాండముట్టుననఁ గాఁదగునబ్ధి యగడ్తరూపమై 54

మ. అల్లసుధాపయోధివపురంతరమాంబుజనాభుఁడాంగ, హృ
ద్వల్లభరాజధానియగు ద్వారకలోసుఖియించుచుండు సం
పల్లలితాంగి యెప్పుడును బాయక పుట్టినయిల్లు నత్తనా
రిల్లును నేకదేశమగునింతులవేడ్కలసంగొనంతయే. 55

మ. అలకౌన్నత్యపురీవరావరణరేఖాగ్రప్రదేశంబులం
గలయన్ గొమ్మలసందులేర్పఱిచి మార్గశ్రేణిఁగల్పించుటన్
నలినీకైరవిణీమనోహరులయానంబుల్ నిరోధంబులే
కలఘుస్ఫూర్తిఁదదంతరంబులఁబోసంగన్ నిర్గమించుంగదా. 59

క. అగణితతారాగణచయ, గగనాంతము నిశలఁ దనరు ఘనలీలఁబురిన్
దగఁ గోటకొనలఁగట్టిన, పగజిగిముత్యములచందువాచందమునన్. 57

సీ. సహచరీశంకాప్రసక్తామరీహూయమానకర్బురపుత్రికానుతములు
ఇనవాహహేషాప్రహేళితప్రతిబింబధారణతోరణదర్పణములు
సామంతభభ్రాంతిసల్లాపకృత్తారకామిళద్వప్రముక్తాఫలములు
ద్వైతపారావతప్రతిస్వనసంభ్రమప్రదవిటవిటీమణితరవము
తే. లంబుజకదంబశాత్రవబింబమస్య, హరిణకబళితకుహనాతృణాంకురాయి
తస్ఫురద్గారుడోపలాతతవితర్ది, యూథములసౌధములపురినొప్పుమీఱు. 58

చ. ఉదయనగేంద్రమెక్కియినుఁడున్నతమైగగనంబుఁదాఁకు ద
త్సదమలహార్మ్యముల్గనిరథంబున కడ్డమునిల్చునంచుఁదా

మదిఁదలపోసి తిన్ననగు మార్గమునం జనుఁడంతకంతకున్
జదలను నిక్కియవ్వలచు సందిగి పోవుచునుండు నిచ్చలున్. 59

మ. పగలున్ రేయి సమప్రకాశతను జీవంజీవబంధుండు సొం
పగు మత్తెంబుల చేరు మక్కగమియున్ వ్యాజంబునన్ జేరు చ
క్కగు మింగూడియ నేకరూపములతోఁ గన్పట్టె నా నొప్పగున్
నగరీహేమశిరోగృహాగ్రవిహరన్నారీముఖాంభోజముల్. 60

ఉ. నిర్మలభర్మరత్నమయ నిర్మితవిస్ఫుటహర్మ్యసంచయాం
తర్మదనాహవశ్రమగత ప్రమదారమణచ్ఛటాతనూ
ఘర్మనివారియై వినుతిఁ గాంచు నుపాంతనిలింపనిమ్నగా
హర్మ్యఖపద్మగంధవిభవానుభవాంచితగంధవాహముల్. 61

తే. మీఁదనున్నట్టి కుంభసింహాదికములు, తారకామండలంబునఁ దగిలియుండఁ
జంద్రబింబంబు నంటె నాసౌధరుచులు, సురపురము మీఁదఁ దనరు గోపురవిభాతి. 62

సీ. అతనిజన్మస్థానమగు విష్ణునాభికి నూర్ధ్వమౌ ముఖమున నుదయమైరి
అతఁడు నల్గామముల నభ్యసించినయట్టి చదువేకముఖమునఁ జదువుకొనిరి
అతనిరాజసగుణస్థితికంటె నుత్తమంబగు సాత్త్వికమున శుద్ధాత్ములైరి
అతఁడు మున్ జిరతపోగతిఁ గన్న హరినిభావితభక్తిపరదుఁ గావించుకొనిరి
తే పెద్దపిన్నతనంబు రూపించుకొనిన, యధికు ననచ్చుహంసవాహనునికంటె
సకలసౌజన్యగుణసుధాసారనిధులు, భూసురేంద్రులు గలరు తత్పురమునందు. 63

సీ. సముదీర్ణచంద్రహాసకళావినోదముల్ ముఖములందును రణోన్ముఖములందు
ధర్మగుణానుసంధానతాచతురతల్ శయములందును హృదాశయములందు
బుధగురుచక్రావనధురీణచిహ్నంబు లాఖ్యలందు నిజాన్వయాఖ్యలందుఁ
బ్రకటపంచాననప్రక్రియావిభవముల్ భటులందు విక్రమార్భటులయందు
తే. వెలయ వెలయుదురనివార్యవీర్యశౌర్య, ధైర్యగాంభీర్యసమధికౌదార్యతుర్య
ధుర్యులైనట్టి బాహుజవర్యులెపుడు, సిరులఁ జెలువొంగు నప్పురవరమునందు. 64

సీ. తనలోనిరత్నసంతతుల ధోగతిపాలుపఱచుకోఁడేని సాగరుఁడు సాటి
తనమూలధనమునకుఁ దగినలాభముఁ గూర్చుకొనెనేని ధననాయకుండు సాటి
తనకున్న బంగారమును వక్కరలకియ్యఁ జాలినఁ గాంచనాచలము సాటి
తనమహత్త్వమునకు నెనయైనభోగానుభవమందెనేనిఁ గల్పకము సాటి
తే. గాని యితరులు తాదృశుల్ గారనంగ, నర్థసంపదతోడ విఖ్యాతసుకృత
సంపదలనంతములు గాఁగ సంగ్రహించు, వైశ్యులుందు రప్పురవరమునందు. 65

సీ. జన్మస్థలంబు నిర్జరశిఖాకుసుమగంధావాసితంబైన హరిపదంబు
పైదోడు ప్రకటధూర్జటిజటామకుటరంగదభంగనిజభంగ గగనగంగ

ప్రారంభమఖిలవర్ణాశ్రమజనతిర్యగాదిజీవనమైనహాలికంబు
స్వాచారమిష్టకామ్యార్థసిద్ధిదమైనయనిరుద్ధమూర్తియభ్యర్చనంబు
బుద్ధిబ్రాహ్మణభక్తియుభూతదయయు, శాంతమునుగల్గిచెలువొందుసత్పథంబు
గాఁగసౌజన్యశీలురై కలిమిబలిమిఁ, గలిగిసుఖియింపుదురుశూద్రకులజులందు. 66

సీ. రంజితౌఘరసుధారససమేతంబులై ముఖచంద్రబింబముల్ ముద్దుగులుక
నవతంసకుసుమతారావళీయుతములై కచభారతమసముల్ గరిమఁజూపఁ
గమనీయమణిమాలికార్చురాంచితములై కుచకుంభశైలముల్ కొమరుమిగులఁ
గంకణేంద్రోపలాంకమిళిందచయములై పాణిపద్మంబులుపరిఢవిల్లఁ
గలితమోహనరూపరేఖావిలాస, విభ్రమంబులుజగిమెల్లవినుతిసేయ
నతులగతివారశృంగారవతులువేన, వేలువిహరింతురెపుడునవ్వీటియందు 67

సీ. పలువరుసలకుందములఁజూడఁబ్రియమయ్యె వెలయింపుసొంపునఁబలుకఁగదవె
పగఁజూపునల్లగల్వలవినోదముతానె వలపుబఱుముంచెనవ్వారిగాఁగ
మేలుచేఁదమ్మిక్రొమ్మిన్నలుగులెక్కడుకూరిచిదయసేయుపేరుగాఁగఁ
బెంపొందెనాసనంపెఁగనిగన్నిగలచే ముద్దుమవేఁడెదమొగినొసంగు
మనుచునను చుముదంబుననంతిపలుక, జాణలవచశ్చమత్కృతిసరణిఁదెలిసి
తెలివిఁజిఱునవ్వులొలయంగనలరియలరు, లమ్ముగురుపుష్పలావికలప్పురమున. 68

మ. పటుదంతప్రచురప్రభాప్రకటశంపాజాలముల్ ఘీంకృతా
ర్భటగర్జారవముల్ సమగ్రమదధారాసారవర్షంబులు
త్కటధాటీనటియింపభూవిహరణోద్యత్ప్రావృషేణ్యాంబుభృ
త్పటిమన్ దత్పుటభేదనద్విరదయూథంబొప్పుసక్రోధమై. 69

మ. పురసీమన్ బురుషోత్తమానువహనస్ఫూర్తిన్ విడంబించుమన్
సిరికిన్ మూలములై సుజీవనకళాస్నిగ్ధంబులై సుందర
స్ఫురితావర్తములై విలాఘుతవనోప్పన్ వాహినీసంగతిన్
దిరమైసార్థకనామధేయగుణభాతిన్ సైంధవవ్రాతముల్. 70

చ. అలఘునిజధ్వజాంచితపటాంచలజాతసమీరణారితా
మలగగనస్థలీయుతవిమానవిహారనిలింపదంపతీ
సలలితపంచబాణరససంజలితోరుపరిశ్రమంబులై
యలరుఁబురిన్ శతాంగములుదగ్రవిరోధిచమూవిభంగముల్. 71

ఉ. బాహుబలోద్ధతుల్ సమరభాగనటద్రిపుచాతురంగిక
వ్యూహవిభేదనక్రమసముజ్జ్వలవిక్రమవిస్ఫురన్మహో
త్సాహసికుల్ ధనుః ప్రముఖసాధనధారణకౌశలుల్ సము
త్సాహరసాకృతుల్ సుభటసంఘములప్పురమందసంఖ్యముల్. 72

వ. మఱియు నన్నగరీలలామంబు వైకుంఠపురంబునుంబోలె నాగనగరంబు విధంబున ననంతకళ్యాణగుణాభిరామంబై, నభోమండలంబు తెఱంగున సుకవికల్పితప్రబంధంబు చాడ్పునఁ గలితకవిరాజవిరాజితంబై, చంద్రబింబంబు పోలికఁ గుసుమితద్రుమంబులీల విరాజమానసాగరంబై, యలకాపురంబు భాతి జలజాకరంబు రీతిఁ బద్మాలంకృతంబై, యధ్యయనవిద్యావిశేషంబుకైవడి సంగీతరత్నాకరంబు చెలువున వర్ణక్రమప్రశస్తంబై, రామాయణకావ్యంబుగతి భార్గవవంశంబుకరణి రామాభిరామంబై, మిత్రభావప్రకాశంబయ్యును గువలయానందంబై, రాజాభ్యుదయంబయ్యును గమలాంచితంబై, హరివిహారంబయ్యును బుణ్యజనరంజనంబై, విబుధవరవిరాజితంబయ్యును సమస్తగోత్రప్రచారంబై, గురుప్రదీప్తంబయ్యును గవిహితంబై, సంపదలకుం గొటారును, సౌభాగ్యంబులకుఁ బుట్టినిల్లును, సౌఖ్యంబులకు నాలవాలంబును, సారస్యంబులకుఁ గాణయాచియు, సంతోషంబునకు నాటపట్టునునై వసుంధరాసుందరీవిటలతటసంఘటితముక్తాలలామంబు పోలికఁ జతుర్ముఖనిర్మితప్రపంచాభరణంబై యొప్పుచుండు. 73

ఉ. ఆపురలక్ష్మికిన్ రమణుఁడై విలసిల్లుచునుండు బ్రహ్మలీ
లాపరిపూర్ణమానుషవిలాసుఁడు భక్తగృహాంతదృశ్య ని
క్షేపము రూపమోహనవశీకృతగోపవధూకదంబుఁడు
దీపితకీర్తిశాలి వసుదేవతనూజుఁడు కృష్ణుఁడున్నతిన్. 74

సీ. వరలీల దేవకీవసుదేవులకుఁ బుట్టి నందయశోదలున్నతిఁ బెనుపఁ
బెరిగి దైతేయులఁ బెక్కండ్ర వధియించి యమునానదీతీరమందనంద
బృందావనక్రీడఁ బెంపొందగోవులఁ బాలించి మురళీవిలోలుఁ డగుచు
వల్లవకాంతలవలపించుచు రమించి భక్తజనావనప్రౌఢిమెఱసి
రుక్మిణీసత్యలాదిగా రూపవతులఁ, జాలఁ బెండ్లాడి సంసారసౌఖ్యనిరతి
నెలమిఁ ద్రిభువనసామ్రాజ్యమేలుచుండెఁ, గృష్ణుఁ డంచితకీర్తివర్ధిష్ణుఁ డగుచు. 75

మ. హరికిన్ రుక్మిణికిన్ దనూభవుఁడు మీనాంకుండు లోకైకసుం
దరలీలాసుకుమారమూర్తి రతికాంతాపద్మరాగోషమా
ధరసారామృతపానకేళిరతుఁడు ద్యద్విక్రమాటోపశం
బరసంహారుఁడు దాత్తకీర్తి నమరున్ బ్రద్యుమ్ననామాంకుఁడై. 76

ఉ. ఆరతివల్లభుండును శుభాంగి యనందగు రుక్మికూఁతు నం
భోరుహనేత్రఁ గూడి సుభూషణుఁడైన కుమారుఁ గాంచె శృం
గారరసంబు విగ్రహముగా నొనరించిన మాడ్కి నొప్పు నా
య్యారము వానిభాగ్యవిభవాదికలక్షణలక్షితాంగునిన్. 77

క. అనిరుద్ధనామధేయుం, డనిరుద్ధవముఖ్యులతని నరివీరులు డా
యనిరుద్ధతులన్ జేసెడి, యనిరుద్ధస్ఫుటపరాక్రమాఢ్యుం డగుటన్. 78

వ. మఱియు బ్రహ్మజ్ఞానసూచనాసమర్థుండు గాఁగలవాఁడని బ్రహ్మసూనామకుండును, ఋశ్యమృగచిహ్నితకేతుండు గాఁగలుగుటం జేసి ఋశ్యకేతుండును నని గురుజనంబులు నామనిర్దేశంబు చేసి రక్కుమారుండు శరత్సమయ శుక్లపక్షసుధాకరుచందంబున నహరహః ప్రవర్ధమానుండై క్రమంబున జననీజనకమనోరథసాఫల్యంబైన బాల్యంబును స్వబంధుజననయనానందశరీరసుకుమారంబైన కౌమారంబును నతిక్రమించిన యనంతరంబ.

సీ. ముఖచంద్రమండలంబునకు నూనూఁగుమీసపుఁ జాలు సహజలాంఛనము గాఁగ
నమరు నక్షికవాటమునకు నేవళంబులు కుందనపుఁ దీఁగె మోడి గాఁగఁ
జెక్కుటద్దములకుఁ జెలువంబు మీఱిన చిఱునవ్వు తేఁటక్రొంజికిలి గాఁగ
సరసమౌకచనీలజలదంబునకు నవతంసదీధితి తటిద్వల్లి గాఁగ
తే. నలజయంతుని చందంబు నలుని సొబగుఁ, జందురుని మేలుఁ గందర్పుచక్కఁదనముఁ
దనకు సరిసేయఁదగిన సౌందర్యమహిమ, నతఁడు చెలువారె నవయౌవనాగమమున. 80

సీ. కనుమెఱుంగులు తళుక్కున నేమఱించు చూపులకు గుండియలు జల్లుజల్లు మనంగ
నరుదుగా నాభిముఖ్యము నొందు మోముకు వాలుకన్గవలు దక్కులు పడఁగ
జెలికాండ్రతో నాడు పలుకుల చేవీనులూఁగి వశ్యమంత్రప్రయోగమందఁ
బ్రతిలేని రూపసంపదఁ జిక్కి తలఁపులు సుడివడ్డగతిఁ జుట్టిచుట్టి తిరుగ
తే. నందుకొనరాని మ్రానిపండైన యతని, బ్రభుతచే నూర్పులూష్మదీర్ఘత వహింపఁ
గొలువునకు వచ్చు వారకన్యలకయోగ, విరహమొదవించె దద్రూపవిభ్రమంబు 81

తే. వాలుఁజూపుల చేతని వాళులొసఁగి, ప్రమదజలముల నర్ఘ్యదానము లొనర్చి
యొలము భావంబు లుపహారముగఁ జేసి, వనితలు భజింతురిష్టదైవముగ నతని. 82

మ. తరుణుల్ వాని విలాససంపదకు నాంతర్యంబునం జొక్కి త
త్పరిరంభానుభవంబుఁ గోరుచు విధాతా వీని మజ్జీవితే
శ్వరుగా నేటికిఁ జేయవైతి నను చున్ సంతాపముం జెందును
స్స్మరుగాడ్పుల్ విధికంగ దాహ మొదవించున్ మందువేసంగియై. 83

ఉ. బింబము మోవి సంకు ప్రతిబింబము కంఠము తారకాధిరా
డ్బింబము మోము సన్ముకురబింబములాదరహాసపుంగపో
లంబులు యక్షనందనకళానిధిముఖ్యులఁ జూతు మేకదా
శంబరవైరినందనుని సామ్యము గా వచియింపఁ బోలునే. 84

ఉ. సాహసధైర్యబాహుబలసంపదచేఁ జెలువొందివాహనా
రోహణహేతిధారణనిరూఢిఁ దనర్చినచో విభూతిశో
భాహితగతిన్ జెలంగి జగదాదరణీయగుణాభిరాముఁడై
యాహరిపౌత్త్రుఁ డొప్పెఁ దనయభ్యుదయంబు సదాభివృద్ధి గాన్. 85

వ. అంత. 86

చ. అతనికి మేనమామసుతయైతగురుక్మినృపాలపౌత్రి యం
చితసుమకోమలాంగిసరసీరుహపత్త్రవిశాలనేత్ర ని
ర్జితకలహంసయానమదసింధురకుంభసమానవర్తులో
న్నతకుచ రుక్మలోచన యనంగననంగశరోపమానయై. 87

గీ. బంధుజీవము లయ్యె బంధుజీవంబులు, యధరపల్లవబింబఫలములయ్యెఁ
దమ్ములయ్యెను చూచుఁదమ్ములఁగనికొమ్మ, యగుగురులకును జిగురులడుగులయ్యె. 88

సీ. కట్టెఁడిపగను జేకట్లుపులోనయ్యె విరసభావంబులై విద్రుమములు
ప్రత్యహంబునుగర్ఘంగమయ్యెను దామసప్రకాశతనునక్షత్రగణము
పగలుమించుటవిదేశగతంబులయ్యె రాజావమానమునరథాంగకులము
కాఁకఁదెచ్చుకతుదిలోఁకువై పలుమాఱుఁ బ్రహారణంబులఁజెందెఁబసిఁడికమ్మి

తే. రమణియధరనఖస్తనాంగములతోడి, ప్రాతిపక్షికమున నివి భంగపడియె
నట్టియార్వేరమునబలవంతుతోడి, సాటికిఁబెనంగుటెల్ల నిష్ఫలము గాదె. 89

సీ. శాతకుంభమునకుఁ జాంపేయమునకుఁ దానగుణంబగుఁ గాంచనాంగియనుట
కంజాతమునకును గైరవంబునకుఁ బ్రియంపదంబు మహోత్పలాక్షియనుట
శకోరిపలమునకు జలధరంబునకును వినయోక్తిఘననీలవేణియనుట
కలహంసమునకు శిఖావళంబునకు హితాలయమండజయానయనుట

తే. యుభయభావంబులతిశయంబునికి సార్థ, కముగనిట్లుంటచతురతకల్పనాంశ
లందువలసినయట్లందురనఁగనిమ్ము, వారికేమినిరంకుశుల్ గారె కవులు. 90

వ. ఇవ్విధంబునం బరిభూతవయస్సుమయయైయున్న రుక్మలోచనను వివాహంబు సేయ నుద్యోగించి తత్పితామహుండైన భీష్మకనృపాలుండును దక్కినవారలును సుహృజ్జనులతో నాలోచించుచు. 91

ఉ. ఈయలినీలకుంతలకునీడును జోడును నైనవల్లభుం
డేయెడఁగల్గునోయనుచు నెంతయునక్కఱతో విచారముల్
సేయుచునుండి బంధువులచే ననిరుద్ధునిరూపసద్గుణ
శ్రీయుతుఁగా నెఱింగి తమచిత్తములం బ్రమదంబు నిండఁగన్. 92

క. నెనరంటినచుట్టఱికం, బునుగులమునుగుణమురూపమునువిద్యాధనం
బును బ్రాయముగలిగినవరుఁ, డొనఁగూడుటకన్యభాగ్యయోగమునఁగదా. 93

వ. అని విచారించి ద్వారవతీపురంబునకుఁ దగువారలం బంపుచు. 94

క. శ్రీమత్సమస్తసద్గుణ, ధామాంచితకీర్తి నెన్నఁదగు వసుదేవ
స్వామికి భీష్మకభూప, గ్రామణి తా మ్రొక్కి సేయఁగలవిన్నపముల్. 95

క. క్షేమంబిక్కడ మీపరి, ణామము వ్రాయంగవలయు నా పౌత్త్రుని పు
త్త్రీమణి నిరుక్మనయనా, కోమలి ననిరుద్ధునకును గూర్పఁగవలయున్. 96

వ. అని శుభలేఖలంప విని హర్షముమానసవశ్యమంచుఁ గ్ర
స్కునఁ బ్రతిలేఖలంపి యనుకూలపుఁ లగ్నము నిశ్చయించి చ
య్యన బలకృష్ణముఖ్యులరయంబ సుహృచ్చతురంగయుక్తులై
యనుపమవాద్యఘోషము దిగంతములందుఁ బ్రపూరితంబుగాన్. 97

సీ. కుండినపురికి నేఁగుటయు వైదర్భులెదురేఁగి నివారలఁ దోడితెచ్చి
విడుదుల విడియించి వివిధవస్తువ్రాతసామగ్రి నడపించి సంభ్రమమున
లగ్నవేళకు మంగళస్నానయుతులైన పెండ్లికుమారికఁ బెండ్లికొడుకు
కెలమితో బాసికంబులుగట్టి కంకణబంధముల్ గావించి ప్రాజ్ఞులైన
తే. విప్రముఖ్యులఖండోక్తవేదరవము, చెలఁగ నుచితప్రయోగముల్ సేయుచుండి
రపుడు తెరనట్టి చాటునకతినఁ దోఁడి, తెచ్చిరి పదాంగదధ్వనులచ్చు పడఁగ. 98

చ. విచికిలగంధియున్ విభుఁడు వేడుకతోఁ దెరరెండువైపులన్
రుచిరకటాక్షపంక్తుల మెఱుంగులు నిండఁగ నిల్చిరయ్యెడన్
బ్రచురతరానురాగరసబంధురతం దెరచీర దూఁతిపా
యుచు హృదయాబ్జముల్ మొగమెఱుంగని చుట్టతికంబు సేయఁగాన్. 99

క. గ్రక్కునఁ దెరవాపుటయుఁ ద, ళుక్కున వెలుఁగొందె మృగవిలోచనముఖస
మ్యక్కాంతి మెయిలు దొలఁగినఁ, జక్కఁగఁ జెలువొందు పూర్ణచంద్రుండనఁగన్.

ఉ. బంగరుపళ్లెరంబులను బ్రాధిగనించిన ముత్తియంబులు
పొంగుచు హస్తయుగ్మములఁ బూర్ణముగాఁ బలుమాఱు ముంచుచున్
రంగుగ నొక్కరొక్కరి శిరంబు పయిం దలఁబ్రాలువోసిర
య్యంగి మరీచివన్యసుణులై దిగుపాఱఁగ నవ్వధూవరుల్. 101

క. ఈవిధమున సుముహూర్తము, గావించి వివాహవేదికాస్థలమునకున్
రావించి రపుడు పంచమ, హావాద్యధ్వనులు బహుళమై మొరయంగన్. 102

క. చెలిపాదము చెలువుఁడు కర, జలజంబునఁ బట్టి నడపె సప్తపదంబుల్
సొలయులు కదిస్సినాఁటికి, యలవడునని వావిరైన యతివలు నవ్వన్. 103

వ. తదనంతరంబ ప్రధాన హోమాదికంబులైన వైదికలౌకికప్రయోజనంబులు నడపి వివిధవిధభక్ష్యభోజ్యాదిపదార్థంబుల సకలజనసంతోషంబుగా భోజనోత్సవంబు గావించి రందు 104

మ. పరమాన్నంబులుఁ బిండివంటలును సూపంబుల్ గమాయించు పం
డ్లరసంబుల్ మధురామ్లశాకములు బెల్లంబాజ్యమున్ దేనె క
ప్పురపుం దోయము మీఁగడల్ పెరుగులుప్పుంగాయలున్ మున్నుగాఁ
బరిపూర్ణంబుగ నారగించిరను సొంపం బెండ్లివారందఱున్. 105

సీ. చెలిపయోధరకుంభములు దాఁచుకొన నేల ఘనమయ్యెఁ ద్రుష్ణ చేకొనఁగ నిమ్ము ✓
లతకూన మధురలీలాధరఫలరసంబులు చాల నభిలాషఁ బొందమఁ జేసె

వలివేణినీచేతి యతిరసరుచిరస జ్ఞానందమయ్యె నేమనఁగవచ్చు
రాకేందుముఖి విను మాకారమంతచక్కని దెన్నఁ డెఱుఁగ ముకన్నులాన
యనుచుభోజనసమయంబులందుభాష, గర్భితములాడుసరసులకాంక్షకొల్ది
ననుభవింపుఁడుకొదవలేదనిసమర్థ, వక్తలై బోనకత్తెలు భుక్తులిడిరి. 106

శా. తాంబూలంబులు నారికేళకదళీ ద్రాక్షాదినానాఫలా
ఘంబుల్ చంపక మల్లికాదిసుమనఃకస్తూరికాగంధసా
రంబుల్ శర్కరలిక్షుఖండములువస్త్రంబుల్ సువర్ణంబు నె
య్యంబేపారఁగఁబంచిపెట్టిరిజనంబానందముంబొందఁగాన్. 107

వ. ఇవ్విధంబున. 108

భుజంగప్రయాతము.

వివాహప్రయత్నంబువిధ్యుక్తరీతిన్, నివర్తించి ప్రౌఢాబ్జనేత్రల్ నిషేకో
త్సవారంభమున్ ప్రేమసంధిల్లఁజేయన్, నవోఢారతుల్ మోహనంబై చెలంగెన్. 109

తే. గంధమాల్యాదివాసనల్ గ్రమ్ముకొనఁగఁ, దోడుకొనివచ్చి రప్పుడాతోయజాక్షి
సరసుఁడున్నట్టి కేళికాసదనమునకు, బలిమిచే నేర్పుచేతను బద్ధముఖులు. 110

ఉ. ఎవ్వరికోసమీవగలకేమియుఁ గన్ బదమంచు నెచ్చెలుల్
నవ్వుచుఁ ద్రోచిపోవుట యునాథుని చెంగట నిల్చియుండెఁ దా
నివ్వలనవ్వలన్ దొలఁగనియ్యక మన్మథుఁడానవెట్టి న
ట్లవ్వనజాక్షి సిగ్గుబరువాని నరీతి శిరంబువాంచుచున్. 111

ఉ. శయ్యకుఁజేరఁదీసిపతిసారెకు వేఁడఁగ నించుకైన మో
మియ్యక గుబ్బలంటుకొననియ్యక నిష్ఠురతిన్ రమింపఁగా
నియ్యక యెంతసేసెవలయింవిన పిమ్మట సౌఖ్యదాయకం
బయ్యెను నారికేళఫలపాకములాఁగదకన్యకారతుల్. 112

తే. విభునితమకంబుతో నిట్లు వెలఁదిసిగ్గు, పోరుకెల్లనువట్టియాశ్వేరమయ్యెఁ
దుదినిలువలేక గొందులుదూఱియుండెఁ, గాననబలాశ్రయము నభంగము ఘటించు.

వ. తదనంతరంబ. 114

సీ. అధికప్రయత్నసంశిథిలనీవీబంధమభిముఖకుంచితాస్యాంబుజాత
మాలస్యకరగృహీతాంచితకుచకుంభమనురాగరసనిగూఢాంతరంగ
మాయాసలబ్ధబాహాలతాపరిరంభమాకుంచితభ్రూయుగాభిరామ
మామోదబాష్పధారాపూరితాంబకమలఘుసీత్కారమోహననినాద

తే మచిరసంభూతమదనతోయప్రవాహ, మవగతోష్ణాంగజాతఘర్మాంబుకలిక
తృప్తిపరవశజనితనిద్రాభిలాష, మగుచునయ్యింతిప్రథమసమాగమంబు. 115

క. ఆమోదంబొనరింపఁగ, నామోదము విరియుఁబోలె నైక్యస్థితితో
దామోదరపౌత్త్రుఁడును, ప్రేమోదయహృదయుఁడగుచుఁ బెనఁగెన్ రతులన్. 116

వ. తదనంతరంబ యాదవసమూహం బవ్వధూవరులం దోడ్కొని కతిపయప్రయాణంబుల ద్వారవతీపురంబు నకుం జని యథోచితసుఖంబుల ననుభవించుచుండి రయ్యనిరుద్ధుండును.

చ. విలసితలగ్నవేళఁ గడువేడుకతోడ గృహప్రవేశ మిం
పలరఁగఁ జేసి యవ్వనరుహాననఁ గూడి యతండు ప్రేమచే
సలలితకేళికావనులసారససారసరోవరంబులం
జెలువగు రత్నగేహములఁ జిత్తము రంజిలఁగా రమించుచున్. 118

సీ. కేలనంటఁగరాని గిలిగింత చేమాఱు పెనఁగుట లొక కొన్ని దినములందు
నేమి చేసినఁగాని హితము చేసుక సన్నుతించుట లొక కొన్ని దినములందుఁ
జవుసీతిబంధవిభ్రాంతిమార్గములన్ని దెలిసికూడుట కొన్ని దినములందుఁ
దానపైకొని సురతప్రౌఢిఁ దమిదీర నెనయుట లొక కొన్ని దినములందు
నగుచు నారుక్మనయనాసమాగమంబు, తనమనంబున కంతకంతకుఁ బ్రమోద
రసము కొలుపంగ గాఢానురక్తినుండె, రసికశేఖరుఁ డారతిరాజసుతుఁడు. 119

వ. అని శుకుండు పలికె ననినం బ్రమోదహృదయులై శౌనకాదులు సూతుం గనుంగొని యయ్యనిరుద్ధుని విహారం బెవ్విధంబున నుండె నటమీఁదటివృత్తాంతంబుఁ దేఁటపఱుపుమనుటయు. 120

చ. వరవరదానశీలమదవారణవారణచక్రజ్జలాటభీ
కరకరచక్రజన్మలయకారణకారణనైజలీలసా
దరదరహాసదుష్టరిపుదారుణదారుణకోటితేజభూ
ధరధరదుగ్ధసాగరసుతానవతానవభోగసంగమా. 121

క. నిలయీకృతవైకుంఠా, బలవద్రిపుభయదశౌర్యపటుతాకుంఠా
కలితరుచికంబుకంఠా, సలలితలక్ష్మీప్రసంగజనితోత్కంఠా. 122

మాలిని. మునిహృదయనివేశా మోక్షదానప్రకాశా
వినుతగగనకేశా వీతసంసారపాశా
సనకమునిజనిదేశా చారువక్షఃప్రదేశా
మనుజచరవినాశా మంగళాద్రిస్థలేశా. 123

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాదసంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరాయనమంత్రితనూభవసుజనహితకృత్యనిత్య యబ్బయామాత్యప్రణీతంబైన యనిరుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# అనిరుద్ధచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

---



రమణీహృదయంగమ
చారుతరశ్యామలాంగసమలంకృతమం
జీరకటకాంగుళీయక
హారాంగదవలయమంగళాచలనిలయా. 1

తే. అవధరింపుముశౌనకుండాదిరైన, మునివరేణ్యులతోడనిట్లనియె సూతుఁ
డాపరీక్షిన్మహారాజునాదరమునఁ, జూచివిజ్ఞాననిధియైనశుకుఁడుపలికె. 2

మ. పరిఖాగాధకబంధసంవృతమహాపాతాళభాగంబు గో
పురకంఠీరవరూపపాటవపరాభూతేంద్రనాగంబుభా
సురవిస్తారమణిప్రకీర్ణసరణాంశువ్యాప్తదిఙ్మండలం
బరిసంత్రాసకరంబుశోణపురమొప్పారున్ ధరామండలిన్. 3

శా. బాణుండుద్ధతసత్వనిర్జితజగత్ప్రాణుండుసాతత్యశ
ర్వాణీవల్లభపాదపద్మభజనారంభ ప్రవీణుండుగీ
ర్వాణవ్రాతమనోభయంకరధనుర్బాణుండుసంగ్రామపా
రీణుండప్పురమేలుచుండువిజయశ్రీవైభవాక్షీణుఁడై. 4

తే. తనసహస్రభుజాబలౌద్ధత్యమహిమ, నేఁచిముల్లోకములయందునెదురులేక
బలితనూభవుఁడైనయబ్బాణదైత్యుఁ, డుగ్రశాసనుఁడైయుండియొక్కనాఁడు. 5

వ. భవానీమనోహరుండగు హరుం డఖండతాండవకేళిరతుండై ముఖరితమృదంగంబును, రణితోపాంగంబును, సంగీతప్రసంగంబును, బరితోషితాశేషభూతాంతరంగబునునగునృత్యరంగంబున దశప్రాణాత్మకంబును, మార్గత్రయకళారమ్యంబును, లఘుగురుప్లుతసమేతంబును, దకతకధికతకముఖశబ్దబంధురంబునగు ధ్రువమఠ్యరూపక ఝంపాత్రిపుటాటతాళైకతాళ సింహానంద చంచుపుటాదితాళంబుల జతులుకడకట్టుకై మురికళాసికల ద్రుతమధ్యవిళంబకాల పరిమాణంబుల దండలాసక కుండలిప్రేరణీప్రముఖమార్గంబుల రంగరక్తులువహింప నాట్యంబుసలుపునవసరంబునభరతకళాధురీణుండగుబాణుండావజంబారజంబునం బుచ్చుకొని శ్రుతిప్రమాణంబునిలిపి తకధిమికిట శబ్దాక్షరసముచ్చారితముఖుండగుచుఁ గరప్రహారంబులం జిత్రవిచిత్రంబులై చెలంగు తాళవ్యాప్తులుఘుమంఘుమాయమానంబై నాదబ్రహ్మంబుజనియింపహృదయారవిం

దంబున కానందసంపాదకంబై నెఱయ మొఱయించిన నప్పరమేశ్వరునాట్యంబు
జగన్మోహనంబై ప్రవర్తిల్లెనప్పుడు. 6

ఉ. బాణునివాద్యవిద్యకునపారముదంబునఁ బొందిశాంకరీ
ప్రాణవిభుండు మెచ్చితిదయన్ వరమిచ్చెద వేఁడుమన్న గీ
ర్వాణవిరోధినానగిరివాకిటఁబారిషదాళితోడ శ
ర్వాణియునీవుభక్తజనవత్సలకావలియుండవేకృపన్. 7

తే. అనుచుమ్రొక్కి నఁగరుణించిసాంబశివుఁడు, దానవేంద్రునిపట్టణద్వారమునను
గాపురంబుండెనిదిలఘుకార్యమనక, యెంతసులభుండుపార్వతీకాంతుఁడహహ. 8

తే. ఏమహాత్మునిమహిమబ్రహ్మేంద్రముఖ్యు, లెఱుఁగఁగాఁజాలరట్టిసర్వేశ్వరుండు
నిజపురద్వారపాలుఁడైనిలువమెలఁగె, నౌరవానిదిగాకభాగ్యాతిశయము. 9

లఘుస్రగ్ధర. ఆలీలంబూర్వదేవుండతులదశశతోద్యద్దోర్దండహేతి
జ్వాలాదందహ్యమానస్వరధిపశిఖివైవస్వతక్రవ్యభుక్కీ
లాలాఘ్యత్తూదదిక్పాలకగణహృదయశ్లాఘ్యబైక్రమ్యలబ్ధ
త్రైలోక్యప్రాభవుండైతనరెభువనసాధారణస్ఫూర్తితోడన్. 10

క. సురవైరిమతియుఁగొన్నా, ళ్లరుగఁగనొకనాఁడుమదనహరుఁబొడగనిత
చ్చరణమునకునతిభక్తిం, బరిణతులొనరించి వినయభాషాపరుఁడై. 11

మ. గిరిజామానసహంసహంసవరయోగిధ్యేయచిద్రూపరూ
పరుచిశ్రీజితముక్తముక్తిభుజదర్పవ్యాఘ్రదైత్యేంద్రయిం
ద్రరమావల్లభమిత్రమిత్రరజనీరాట్చక్రచక్రాబ్జసుం
దరరేఖాకరపద్మపద్మశరభానాశంకరాశంకరా. 12

వ. అని బహుప్రకారంబులస్తోత్రంబు గావించియిట్లనియె. 13

క. లోకములెల్లజయించితి, సౌకర్యముగాఁగసకలసౌభాగ్యంబుల్
చేకొంటిఁగీర్తి నొందితి, నీకారుణ్యమునఁ జేసినీలగ్రీవా. 14

ఉ. ఆహవభూమిమామకసహస్రభుజాబలతీవ్రధాటికిన్
సాహసలీలతోనెదిరిశౌర్యముఁజూపఁగఁజాలినట్టియ
వ్యాహతవిక్రమాఢ్యుఁడొకఁడైననులేఁడొకనీవుదక్కహా
లాహలలాంఛనాంచితగళాపరిరంభితసర్వమంగళా. 15

ఉ. ఆతతవైరివీరసముదగ్రకరోద్ధృతహేతిభూతసం
ఘాతవిముక్తరక్తజలకాంతులుకంకణపద్మరాగసం
జాతమరీచులంగలయసంగరకేళిఘటింపఁజేసినా
చేతులతీఁటకౌషధమునేయఁగదేవజతాద్రిమందిరా. 16

వ. అనిప్రార్థించుచున్నయద్దోషాచరుభాషణంబులకురోషించి శేషభూషణుండిట్లనియె.

క. నాయంతవానితోనని, సేయంగలిగెడునునీనుచేతులబరువున్

శాయుభవదీయకేతన, మేయెడఁ ధరగూలునప్పుడుహీనవివేకా. 18

వ. నిర్విచారుండవై యుండుమన్న నియ్యానతిచ్చిన బలినందనుండు డెందంబున నానందంబు
నొందుచు నందివాహనునకు దండ వందనంబులాచరించి మరలి నిజమందిరంబునకేతెం
చియాత్మీయశ్రేయోహానిహేతు భూతంబైనకేతుపాతంబున కెదురుచూచుచు నీచాః
కలహామిచ్ఛంతి యనువచనంబునకు నగ్రసాక్షియై యుండె నంత. 19

ఆ. అతనికూర్మికూఁతురందంపుబిత్తరి, ముద్దుగుమ్మభువనమోహనాంగి
కుందనంపుబొమ్మకుసుమకోమలియుషా, కన్యయనఁగనొప్పుకమలనయన. 20

ఉ. ముద్దులమాటలున్ జిలుతమోమునునున్ననిలేఁతచెక్కులున్
గొద్దిగనున్న నెన్నడుముకూఁకటికందకఫాలపట్టికన్
విద్దెముసేయుముంగురులువిప్పగుఱెప్పలగొప్పకన్నులున్
బ్రొద్దొకవింతయైయమరెఁ బుష్పసుగంధికి బాల్యవేళలన్. 21

సీ. అరవిందములుమన్మథాస్త్రంబులైనట్లువాలుఁగన్గొనల గ్రొవ్వాఁడివొడమె
హరినీలములుపేరులైనచందముననించుకలైనకురులుపెన్సోగలయ్యె
వీణాశ్రుతులుమేళవింపైనవగముద్దుపలుకులుప్రౌఢసంపదవహించెఁ
గనకంపుఁగణికకుందనమైనరీతిఁ జాయలమేనునిండుతేపలవహించె

తే. నిమ్మపూపలుముదిరిఫలమ్ములైన, గతిఁజనుముకుళ్లునిగిడిపొంకమువహించె
బంధుజీవాధరయతీతబాల్యయగుచు, నిండుజవ్వనమున నొప్పుచుండునపుడు. 22

మ. కలవాక్కీరహయంబుగల్లమకరీకస్తూరికాపత్రస
ల్లలితాంకంబునితంబబింబపటులీలాచక్రమాలోకనాం
చలబాణౌఘముభ్రూలతాయుగమహాచాపంబునై శోభిలెన్
జలజాతాననవిగ్రహంబురతిరాజస్యందనప్రక్రియన్. 23

ఉ. తేనియలొల్కుమోవియును దియ్యనిమాటలుఁ బువ్వువంటి నె
మ్మేనునుముద్దుఁజెక్కులును మెచ్చులుఁగుల్కెడుగుబ్బచన్నులన్
మీనులవంటికన్నులునుమిక్కిలియైనపిఱుందుసన్నపుం
గౌనునొయ్యారపున్నడపుఁగల్గివెలుంగుమనోహరాంగియై. 24

తే. ఒఱపుగలచందురునిచందమోము మోము, నలరశైవాలలీలఁ జెన్నారు నారు
పరిమళముగుల్కుకపురంపుఁబలుకు పలుకు, కలికిరాజమరాళసంగతులుగతులు. 25

సీ. ఘనసారమునుసారఘనమునాక్షేపించుఁ గలికిపల్కులయింపుకచమువొంపు
పద్మరాగమురాగపద్మమునదలించు రమణంపుమోవిపాదములతీవి
మృగమదంబునుమదమృగమునుహసియించుఁ గాయంపువలపుకన్దోయిమెఱుఁపు
ఐరనాగమునుసాంద్రపరముఁజుల్కఁగఁజేయునవకంపునూఁగారునడలతీరు

చక్రసామ్యతవెలయుకుచంబులందు, సామ్యచక్రతఁదగువుక్కసప్పఁబిఱుందు ✓
రూఢినారోహిణియునవరోహిణియుఁగ, నెలతచెలువంబుసారెవర్ణింపఁదగును 26

చ. మలయజగంధిబిత్తరపుమాటలుపీనులుసోఁకినంతనే
చిలుకలుపల్కినట్లువిఁసిల్లునసంతపువేళఁగోవెలల్
చెలఁగినయట్లుకిన్నరలుచిత్రవిధంబునమీటినట్లువీ
నులువెరయించినట్లుమదినిండుఁబ్రమోదరసప్రవాహముల్. 27

ఆ. ఇరులుసిరులుదొరలుకురులుతియ్యఁదనంపుఁ, దీవితీవిలావికావిమోవి
కులుకుపలుకులుకుసలుకుమెలఁకువసుమచాపు, తూపురూపుమాపుచూపుకోపు. 28

చ. కొలుకులకెంపుసొంపురహిగుల్కెడుతారలనీలిమంబుక
న్బెళుకుమెఱుంగులుంగలసిపెంపమరెన్ హరిణాక్షిచూపుల
వ్వలదొరముజ్జగంబుగెలువన్ నవచూతదళంబుమేచకో
త్పలమరవిందమొక్క మొగిఁబట్టిప్రయోగముసేయుకైవడిన్. 29

సీ. ఘనుకారుననుకారుకొనిమీరుఘనచారుతనుమారుకొనికేరుఁదగుణికురులు
నలకుందములయందములచందములమదములనొందఁగాఁజేయుఁజెలిరదాళి
తెగరానివగమేనితొగరేనిజిగిఁబూనితగుదానిసొగసైననగుమొగంబు
వెలపెంపువెలయింపుకళగుంపుగుల్కింపుబలుదింపుఁదలపింపుఁబణఁతిమోవి

తే. సింగములభంగములనొందఁజేయునడుము, కీరములదూరములదొలఁగించుబలుకు
జక్కవలఁదక్కువలఁజేయుఁజన్నుదోయి, ముదితరూపంబుత్రిభువనమోహనంబు.

సీ. ఇంపుసొంపులగ్రుమ్మరింపుమాటలువీణెపలుకులకుఁకత్తురాభ్యాసమొసఁగు
మందంపునడపులుమాయూరగతులకుఁబలుమాఱుతిన్ననిఫణితిఁజూపు
సరసంపునాసికసంపెంగమొగ్గకుఁగన్నెతక్కనల్ చక్కదిద్దుఁ
జొక్కంపుగుబ్బలుజక్కవకవలకు దిట్టతనంబుపదేశమిచ్చు

తే. హొంతబాడుటవనవిహారోత్సవంబు, సలుపుటయుఁబుష్పవితతివాసనలుగొనుట
నెఱసరసిఁగ్రీడలాడుటనెపములుగను, నతనిసౌందర్యమింకనేమనివచింతు. 31

క. ఇటువంటియనయవంబుల, నెటువంటివిలాసవతులనెనసేయఁగరా
నటువంటినగనురజనీ, విటువంటిమొగంబుగలిగివెలఁదుకరయొప్పెన్. 32

ఉ. మేరుగనుష్కదేవిస్వరమేళకళానిధిదత్తిలంబుభాం
డీరముకోహళీయ్యకము తేవిగఁగాన్యమునాటకంబలం
కారముశాస్త్రముల్ మొదలుగామతియభ్యసనంబొనర్చిశృం
గారపువిద్యలద్దనుజకన్యకపణ్ బరమానురక్తయై. 33

ఆ. ఆడఁబాడనేర్చియభినయింపఁగనేర్చి, సరసకవితచెప్పఁజదువనేర్చి
దానవనుజపుత్రిబాలికయయ్యును, సకలకళలయందుజాణయయ్యె. 34

వ. అంత నితాంతకాంతి కాంతవనాంత లతాంత పరిమళాక్రాంత దిశాంతంబైన వసంతంబు ప్రవేశించె. 35

సీ. శ్రీయుతారామరామాయాతనప్రాప్తి సంభోగరతమనస్సౌఖ్యరాశి
యువనవోఢాత్రపాప్రవణకుట్టాకంబు సద్విజానీకవాంఛాఫలంబు
ప్రోషితభర్తృకాయోషిద్వ్యథామూల మనుపమయోగిధైర్యచ్ఛిదంబు
భాసురతరశరద్వాసరసారంబు జాతికా సముచ్చాటనంబు
తే. నగుచువర్ణింపయోగ్యమైయతిశయిల్లె, వివిధసుమబృందనిష్యందనవమరంద
బిందుసందోహపానమిళిందసుంద, రాగమంబైనయవ్వసంతాగమంబు. 36

తే. దండిమీఱంగఁదరువులనుండిమిగులఁ, బండిరాలినవస్థలినిండిదళము
లమరెవనలక్ష్మిమాధవాగమనవేళ, నడుగులకుఁబఱపించినపుడుఁగులనఁగ. 37

చ. వలపులవేల్పుకైదువులుపాంథజనంబులపాలియగ్నికీ
లలుచెలువొందుకోకిలకులంబునకాఁకటిపంటకొల్చురా
సులువనలక్ష్మిమేనఁబొడసూపెడురాగరసాంకురంబులిం
పలరెడుకాంతులంగిసలయంబులుతోఁచెననోకహంబులన్. 38

క. సుమనోవిరాజితంబై, యమరనగస్ఫూర్తిఁదనరియారామంబుల్
సుమనోవిరాజితంబగు, నమరనగస్ఫూర్తిఁదనరెనభిరామంబై. 39

తే. సద్విజాళిప్రసంగంబుసరసతరము, ప్రణవవిస్ఫూర్జితముబీజబంధురంబు
పల్లవాలంకృతముఫలప్రదమునైన, యాగమస్థితినొప్పెసర్వాగమములు. 40

సీ. అనిలోపదేశనాట్యక్రీడఁదగులతాబింబోష్ఠలకుసరిపెనలాసంగ
నింపుసొంపులఁబాడునెలతేఁటిబయకాఱుపవన్నెమీఱునీలములొసంగఁ
గైవారములుసేయుకలకంఠకులవందిబలగంబునకుమావులనొసంగ
ఫలరత్నములవారతులొసంగుభూజపురంధ్రిజనులకంబరములొసంగఁ
తే. దనవదాన్యచమత్కృతిజనులుపొగడఁ, దనవిలాసంబుభువనమోహనముగాఁగ
విభవసంపన్నుఁడైవనవిహృతిసలిపె, మాధవుండువనీరమణీధవుండు. 41

తే. శుకభరద్వాజముఖసద్విజకులరక్షఁ, దనరిసుమనస్సమూహవర్ధనమొనర్చి
ఘనతరాగమవేద్యుఁడై వినుతిఁగాంచె, మహితవనవాసలీలలమాధవుండు. 42

వ. అట్టివసంతకాలంబునందు. 43

క. నాళీకముఖియుషాంగన, యాళీజనసహితయగుచునళికోకిలకీ
రాళీనినాదశోభిత, కేళీవనవాటియందుఁ గ్రీడయొనర్చెన్. 44

సీ. చెలువంపుఁజిగురుటాకులుపాదములుగాఁగ ననకంపురంభలూరువులుగాఁగ
సూనవాసనలునెమ్మేనితావులుగాఁగ నొఱపైనలతలుబాహువులుగాఁగ
గజనిమ్మపండ్లుచొక్కపుఁగుచంబులుగాఁగఁ గలకంఠరుతులువాక్యములుగాఁగ

తులలేనిమల్లెమొగ్గలుదంతములుగాఁగసుమిళిందమాలికల్ చూపుగాఁగ
బల్లవితతమాలపాదపచ్ఛాయలు, సరసమైనవేణిభరముగాఁగ
నెన్నఁదగియెనప్పుడిందుబింబాననయౌవనంబుఁబోలి యవ్వనంబు. 45

సీ. భూరుహావళులశృంగారభావములులోచనపజ్క్తులకువికాసంబు నెఱపఁ
కలకంఠశుకశారికాకలరావంబురహిమిఁ చికర్ణపర్వంబుసేయ
లలితచాంపేయపాటలకుందవాసనల్ నాసికంబునకునానంద మొసఁగఁ
నమృతోపమానంబులగుఫలరసములువెలయజిహ్వాలకునువిందులొసఁగ

తే. గమ్మతావులుపయిపయిఁగ్రమ్మివిసరు, చలువతెమ్మెరమేనులయలఁతఁదీర్ప
సారిదిపంచేంద్రియములకుసుఖముగాఁగ, వనవిహారంబుసలిపిరవ్వనజముఖులు. 46

సీ. అధరబింబాపేక్షనరుదెంచుచిలుకలద్దుఁజెక్కులజవాదితావులకును
వదనాంబుజములకైకదియుమృంగంబులుత్తంసచంపకసుగంధంబులకును
భుజమృణాళాశక్తిఁబొదువురథాంగముల్ సరసమందస్మేరచంద్రికలకు
హస్తపల్లవములకైడాయుకోయిలల్ ముద్రికాంకితరామమూర్తులకును

తే. జకితగతిఁజెందిచెదరఁగఁజంద్రముఖులు, చతురతఁజరించిరప్పుడుచారుచరణ
చలితచామీకరాంగదఝుణఝుణంఝుణ, ఝణంఝణధ్వని చెవులకానంద మొసఁగ. 47

వ. మఱియు నమ్మదవతీతిలకంబు కదంబకాంచన కదలీక్రముక కరవీర ఖర్జూర నారికేళ తమాలతిలక కురంటక మాధవీప్రముఖతరుషండంబులవలనం దిరుగుచు, వనమయూరంబులవెంబడినరుగుచు,మహీరుహంబుల నామూలాగ్రంబుగాఁబెనఁచి యల్లికొని యునేలాలవంగ ద్రాక్షాదిలతావితానడోలాజాలంబులఁ నుయ్యెలలూఁగుచు, బొదరింట్లఁడాఁగుచు, నవమంబులగుపుష్పమకరందవిసరంబులు వెసంగ్రోలిఝుంకారంబుసేయు మధుకరనికరంబులంజోపుచుఁ, బ్రసూనఫలభరితలైయున్న కొమ్మలకు జేతులంజాఁపుచు,స్వచ్ఛంబులైన కుసుమగుచ్ఛంబులును మార్దవనిలయంబులైన కిసలయంబులును మనోరథఫలంబులైన ఫలంబులునుగోయుచు, దోహదవిశేషంబులు సేయుచు, శారికాకీరకలకంఠకపోతకరవప్రముఖ విహంగనాదంబులకుం బ్రమోదించుచుఁ, గ్రీడావిశేషంబులవినోదించుచు, గరకమలకలిత కాంచనకంకణకాంచీకలాపఘంటికానికరనూపురసంజనితఝుణఝుణారవంబువనదేవతామనోహరంబైచెలంగం జరియించుచుండెనయ్యెడ. 48

క. చూతముచూతముసుదతీ, వ్రాతమురారమ్మమధుకరవ్రజగీతో
పేతముసుమసౌరభవి, ఖ్యాతమువిరహిహృదయాభిఘాతముఁదలఁపన్. 49

క. కాంచనవర్ణ్యముకువలయ, సంచారముమాధవప్రసన్నతయును బా
లించుమవానప్రస్థతఁ, గాంచుమధువ్రతకులంబుఁగంటివెచెలియా. 50

తే. పేరుపొగలజాతులపసెల్లఁబెంపుదఱుగ, సౌఖ్యమొదవెఁగుజాతివిజాతులకును
గాలకుటిలంబుఁజూడుమాకంబుకంఠి, మాన్పనెవ్వరివశమమ్మమాధవాజ్ఞ. 51

చ. పలుమఱునీవుకంటఁబగఁబట్టినకైవడినిట్లుమొల్లమొ
గ్గలుచిదుమంగ నేలకసుగందనియీచిగురాకులెల్లఁజే
తులకసిదీఱఁ గాఁగణఁగిత్రుంపఁగ నేటికిమానవమ్మమొ
క్కలమువహించియిందుకొడిగట్టినదానవుమాన నేర్తువే. 52

వ. అనియివ్విధంబున సరససల్లాపంబులుసేయుచుఁ జంద్రకాంతోపలప్రకల్పితసోపానసముదయకూలంకషమధురజలతరంగచ్ఛటాసంచలితపద్మకైరవకల్హారవనవిహరమాణమరాళచక్రవాకబకసారసద్విరేఫమిథునసంసారంబైన కాసారంబుఁజేరి జలక్రీడాసక్తచిత్తంబులనమ్మత్తకాశినులు దత్తఱంబున విహరించుచు. 53

చ జలములఁజల్లులాడుచును సారసపత్త్రలఁ బ్రేటులాడుచున్
బలుమఱునీఁదులాడుచును బక్షికదంబముఁ దోలియాడుచున్
జలదలిమాలికామధురఝంకరణధ్వనితోడలియ్యమై
కలసిలయప్రమాణములఁగంకణనిక్వణముల్ చెలంగఁగన్. 54

వ. విహరించిరప్పుడు. 55

సీ. శంపాలతాంగులచరణకాంతులుకుశేశయకదంబముతోడసరసమాడఁ
దారుణ్యవతులముత్తెములజాందముతరంగావళితోడసయ్యాటలాడ
విచికిలగంధులకుచపాటవముచక్రసంఘంబుతోనెకసక్కెమాడఁ
గలహంసగమనలకన్నులబెళుకులుమీనపఙ్క్తులతోడమేలమాడ
తే. రాజవదనలవేణీభరములసొబగు, ప్రబలశైవాలలతలతోఁ బందెమాడ
బాలికాజాలజలకేళిలీలఁజాల, శ్రీకరంబయ్యెనప్పయోజాకరంబు. 56

మ. కుచకుంభస్థలపాటనంబుదనరన్ గ్రొమ్మించుదంతచ్ఛటా
రుచులొప్పన్ గరపుష్కరాంతరసమారూఢాంబువుల్ మీఁదఁజ
ల్లుచుఁగ్రీడించిరితత్సరోవరమునన్ లోలేక్షణల్ మందమం
దచలధ్యానములన్ మదద్విరదయూథస్ఫూర్తి వర్తిల్లఁగన్. 57

వ. అంత 58

చ. పొదివెడలించుమన్మథునిపుష్పశరంబులలీలనీలతో
యదమునతిక్రమించిపొలుపారెడుశంపలగుంపుసొంపుసం
పదఁదెరవాసినచ్చుజిగిబంగరుజంత్రపుబొమ్మలట్లుస
మ్మదమునవెచ్చెలుల్ సరసిమధ్యము వెల్వడిరుజ్జ్వలాంగులై. 59

క కేళీవిహారచేష్టలు, చాలించియుపాలతాంగిసరసాంబరభూ
షాలంకరణోజ్జ్వలలై, యాళీజనసహితముగగృహంబునకరిగెన్. 60

వ. ఇట్లుచనుదెంచి సరసాన్నపానగంధమాల్యాదిభోగంబులం బరితుష్టయైనాఁటిరాత్రి
తపనబింబోపమానతపనీయవిరచితకుడ్యంబును, మహేంద్రనీలోపలఖచితోత్తస్తం

చి జృంభితంబును, వివిధవిచిత్రవాతాయనరేఖామనోహరంబును, గనకపంజరాంతర నివాసశుకశారికానికరసరససంగీతసాహిత్యవిద్యాప్రసంగతంబును, తాంబూల చందనప్రసూనదానాద్యుపచారప్రయోజనప్రవీణచైతన్యసూత్రవిచిత్రకాంచనపాంచాలికాలంకృతంబును, గంధకర్పూరకస్తూరికాప్రముఖపరిమళవస్తుసంతానవాసనా ఘుమఘుమాయమానంబును, నిబిడతమఃపటలపరిహరణచణమణిగణదీపికావిరాజితంబును, నగు నిజమందిరంబునందుఁ దరవణులదివిచిన వజ్రంబుకోళ్లును, గోళ్లయందమరించినహరినీలంబులపట్టెయలును, బట్టెయలనలవరించి యల్లినపట్టుపట్టెడయును, బట్టెడపయిం బఱచినహంసతూలికాతల్పంబును, దల్పంబుపై శిరశ్చరణపార్శ్వదేశంబులకు నుపధానంబులుగా నుంచిన సూర్యపుటంబుదిండులును, నుపరిభాగంబుననలంకరించిన చిత్రచిత్రాభిరామంబగుచందువాపటంబునుం గలిగి మనోహరంబై వెలయు శయ్యాతలంబున శయనించి. 61

చ. అలకలొకింతజాఱినిటలాంతముఁ గ్రమ్మఁగఁ దావియూరుపున్
జలువలుచల్లఁగా మెయినలందినగంధముసన్నవల్వకు
న్వలువముసుంగుపై నిగిడివాసనలీనగలోచనాంబుజం
బులుముకుళించియమ్మగువముద్దుగన్నిదురించుచుండఁగన్. 62

మ. కలలోనొక్కత్రిలోకసుందరశుభాకారుండుమాణిక్యకుం
డలశోభాంచితమందహాసరసవత్సుస్నిగ్ధగల్లద్వయీ
లలితాస్యుండుసుగంధబంధురసుమాలంకారనీలోపలో
జ్జ్వలధమ్మిల్లుఁడుకామినీహృదయపాంచాలుండులీలాగతిన్. 63

సీ. తాంబూలరసరంజితంబైనకెమ్మోవియానుచో మునపంటనూనియూని
కుంకుమాంకితకుచకుంభముల్ గ్రహణంబు సేయుచో నఖపఙ్క్తిఁ జెనకిచెనకి
మకరికాకలితకోమలగల్లములముఖంబునుచుచోఁ జుంబనంబొసఁగియొసఁగి
లలితభూషణచయాలంకృతాంగము నెదనలముచో మర్మంబులంటియంటి
తే. కుసుమసాయకశాస్త్రానుగుణవిచిత్ర, బంధనైపుణిసురతప్రపంచసౌఖ్య
లీలఁదనుఁజొక్కఁజేసిలాలించెననుచుఁ, గలిశికలఁగాంచెనాశ్చర్యకరముగాఁగ. 64

క. ఈలీలంగలలోపల, నాలోకింపంగఁబడినయతఁడనిరుద్ధుం
డాలావణ్యనిధిన్మను, హేలావతివినియుఁగనియుఁ నెఱుఁగదుమదిలోన్. 65

వ. ఇత్తెఱంగున నక్కురంగనయన స్వాప్నికసంభోగసంజనితానందపారవశ్యంబును, నిద్రాపరవశత్వంబును నేకీభవింప సుఖశయనంబు గావించి కించిదవశిష్టయామినీచతుర్థయామసమయంబున శతపత్రంబులతోన నేత్రంబులు వికసింపనమ్మనోహరాంగుండు తనకౌఁగిటనున్నవాఁడకాఁదలంచుచు మేలుకాంచి పొడగానక గుండియజల్లుమన దిగ్గనలేచి శయ్యాతలంబునంగూర్చుండి నిద్రాముద్రాయమానంబులగువిలోచనప్రభాజాలంబులు లోలంబులై కౌలుకులనలంకరింప నలసంకలంగలయఁ బునఃపునరవలోకనం

బు సేయు మవిభ్రాంతియు విస్మయంబును విచారంబును విషాదంబును విరహంబును నంత
రంగంబునం బెనంగొనం నంతకంతకు నతిశయంబు మోహావేశంబునం దదీయసౌందర్య
సౌకుమార్యవిలాసహావభావంబులు పలుమాఱుం దలంచుచు నాజగదేకసుందరుండు
తనముందరం బొడగట్టినట్లైనం బట్టరాని తమకంబునం బట్టబయలు కౌఁగిటం బట్టం
బోయి భుజలతాయుగంబునకు నప్రాప్తంబైన డెందంబు చిందఱవందఱయై నయనా
రవిందంబులం దొరంగు నశ్రుజల బిందుసందోహంబ మందంబై ప్రవహింప నలవిగా
నిపరితాపంబున వేఁడి నిట్టూర్పు లొదవించుచు నిట్లని తలంచు. 66

ఉ. నిద్దురవోవుచున్నయెడ నిశ్చయమైనవిధంబు దోఁపన
వ్వొద్దికఁ జేరి కూడి సుఖ మొందఁగఁ జేసి భ్రమించినట్టి యా
ముద్దులుగుల్కు జవ్వనపుముస్మరపుం నెఱజాణ యెవ్వఁడో
పెద్దియు నాపె కానిపయిఁ బ్రేమమునం బున నేమి సేయుదున్. 67

శా. ఆచక్రాంచనమావచోమధురిమం బామందహాసామృతం
బాచాతుర్యము నావయోవిభవమా హా మోహముం జేయ దే
యేచంద్రాస్యలకైనఁ బొందఁగలదా యీ మేనితో వానితో
నేచందంబున నామనోరథఫలం బీడేఱు నో దైవమా. 68

వ. అని చింతించుచు. 69

క. లలనామణికూటమిలే, లలనామణిభూషణాంగులలిఁ గలసినయా
కలమాటలు నిక్కంబుగఁ, గలమాటలు గాఁ దలంచుఁ గడు భ్రమచేతన్. 70

సీ. మొనపంటి కొలఁది నొక్కిన నొక్కు చేఁ గెంపుటధరంబు చిమచిమ యనినయట్లు
చెలువారుగోళ్ల నాటుల తేఁటచెక్కిళ్లపై నెలవంక లేర్పడిన యట్లు
చెలఁరేగి యలమినచేష్టు బిగువుచే గబ్బిగుబ్బలు కసుఁగందినట్లు
కళలసొక్కొదవించు గాటంపురతులఁ బూవంటి దేహము వసివాడినట్లు
తే. భావమునఁ దోఁచు స్వప్నలబ్ధంబులైన, సౌఖ్యములు మిథ్యలయ్యు నిశ్చయము గాఁగఁ
బురుషసంగతి చేసినకరణి నపుడు, పద్మదళనేత్ర కరుణానుబంధమునను. 71

క. అంతసఖీప్రేరితయై, సొంతత్వంబైన యట్టిసమయోచితముల్
స్వాంతమున నిచ్చలేకయు, దంతావళయాన యొకవిధంబున నడపెన్. 72

సీ. బింబోష్ఠి దర్పణబింబంబుఁ జూపుచోఁ జెలువుని ముద్దుచెక్కులు దలంచి
కలకంఠి మృగమదతిలకంబు దిద్దుచో సరసుని మేని వాసనఁ దలంచి
కలికి ముక్తామాలికల లంకరించుచో రమణుని మందహాసముఁ దలంచి
పొలఁతి నీలోత్పలంబుల దండ లొసఁగుచో రాముని చికురభారముఁ దలంచి
తే. గంధగజయాన హృదయంబు కరిగి కరిగి, యసురసురమంచుఁ బారవశ్యంబు నొందు
నిగిడి పుంఖానుపుంఖంబు లగుచుఁ దాఁకు, దర్పకుని పువ్వుటమ్ములఁ దాళలేక. 73

వ. మఱియును. 74

సీ. విన్నఁదనంబుఁ గైకొన్న నెమ్మోమునఁ బొడమని చిఱునవ్వుఁ బొందుకొలుపు
దీనభావంబునొందిన వాలుఁగన్నులలేనివికాసంబుఁ బూనఁ జేయు
గద్గదస్వరము సంగతమైన మాటలనొదవని చాతుర్యయుక్తిఁ జూపు
నుల్లాసభంగమై యున్న చిత్తంబునఁ గొలుపని యుత్సాహగుణము నెఱపు
తే. ఘనవియోగవహ్నిఁ గ్రాఁగుచునుండియు, మఱుఁగు సేయు నితరులెఱుఁగకుండ
సఖులు తెలిసి రేని సంశయింపుదురను, భయము వలనఁ గుముదబంధువదన. 75

సీ. ఎలనాగ వీణె వాయించుచో నాహిరిఘంటారవంబునఁ గలసి చెలగు
జలజాక్షి కావ్యంబుఁ జదువుచోఁ బాంచాలగతిచోట బాహాటక్రమము దొనకుఁ
నెలఁత చిల్కకు మాట నేర్పుచో గీర్వాణభాషలోనఁ దెనుంగుఁ బల్కు గలయుఁ
జెలియ పద్యంబు రచించుచో శృంగారరసముపై బీభత్సరసము నిల్చు
తే. విరహవిభ్రాంతికతమున విద్రుమోష్ఠి, యొకటి సేయంగఁ బోవ వేఱొకటి దోఁచు
నగ్గలపుఁ జింత హృదయంబునంటియున్న, నిట్టులొటకు మది సంశయింపనేల. 76

తే. దర్పకుని బాణతీవ్రత దాళలేక, యంగనామణి శివశివా యనివచింపఁ
గలికి కోవెలరొదల చేనలసి సొలసి, రామపలుమాఱు శ్రీరామరామయనును. 77

క. సెగలయ్యెఁ జలువవెన్నెల, పొగలయ్యెను గప్పురంపుఁ బొడి కన్నులకుం
బగలయ్యెఁ జిలుకమాటలు, పగలయ్యెను సుఖములెల్ల వనితామణికిన్. 78

చ. కలకలగాక నిశ్చయము గామదిఁ దోఁచిన నాఁటనుండి తా
గలకలకంఠకీరకులకంఠములం జనియించు దట్టపుం
గలకలము ల్చెవిం బడఁగఁ గాయజునమ్ముల గాయముల్మదిం
గలకలనొంప యామములు కల్పములై చెలియుండె ఖిన్నతన్. 79

వ. ఆసమయంబున. 80

మ. అమరారీశ్వరుఁడైన బాణునకమాత్యశ్రేష్ఠుఁడై బాహువి
క్రమకేళీవిజితాహితప్రకరుఁడై ప్రౌఢిం జతుష్షష్టితం
త్రమహామంత్రకలాపలక్ష్యపరుఁడై రాజిల్లు గుంభాండనా
ముమునం దైత్యవరేణ్యుఁ డొక్కరుఁడసామాన్యప్రభావంబునన్. 81

ఆ. వాని యనుఁగుఁబట్టి వరసుందరాకార, రేఖ నొప్పఁ జిత్రరేఖయనఁగఁ
దండ్రివలన మంత్రతంత్రయోగక్రియ, లభ్యసించియుండు సాంగముగను. 82

శా. ఆనీలాలకబాణకన్యకకు బాహ్యప్రాణమో నాఁగ నెం
తే నేస్తంబొనరించియున్నదగుటం దీనాననాంభోజయై
గ్లానిం బొందుచునున్న యారమణి యాకారంబు వీక్షించి చిం
తానిర్మగ్నమనోంబుజాతయగుచుం దత్కార్యమూహించుచున్. 83

తే. ఇంగితజ్ఞానియగుటనా యిందువదన, వలపుమర్మంబు గాముదిఁ దెలిసి యప్పుడు
పలికె నేకాంతమునఁ జేరి పడఁతితోడ, బడలికలు దీఱఁ జల్లనిభాషణముల. 84

ఉ. ఎన్నఁడు లేని విన్నఁదన మేల మొగంబున దోఁచెనమ్మ నీ
కెన్నఁడు లేని చింత మది నెక్కడ నుండి ఘటించెనమ్మ ముం
దెన్నఁడు లేని యీకృశత నేటికి దేహము చిక్కెనమ్మ నీ
యున్న విధంబుఁ జూచి వగ నొందెడు నాహృదయంబు కోమలీ. 85

సీ. కమ్మని చిగురాకు కెమ్మోవి కసుగందె నుసురుసురని వెచ్చనూర్చకమ్మ
కనకంపు నెమ్మేను కాఁక చేతఁ గరంగె విరహానలంబుచేఁ వేఁగకమ్మ
తళుకు నిద్దంపుటద్దపు మోము కళదప్పె వలవలకన్నీరు విడువకమ్మ
వెలిదమ్మి కన్నుల తెలివి మందము నొందెఁ దురుము మేఘము గ్రమ్మఁ బొరలకమ్మ
తే. పలుకఁగదవమ్మ వేసటపడకవమ్మ, సొలయ నేలమ్మ మోమెత్తి చూడవమ్మ
యేలి చేసెదవమ్మ మమ్మేటికింత, జాలి పెట్టెదవమ్మ యో చంద్రవదన. 86

క. పరిరంభణమృదుచుంబన, సరసాలాపాదిసురతసౌఖ్యంబులచేఁ
గరఁగించు విభునిఁ బాసిన, విరహిణి చందంబు దోఁచె వెలఁదీ నీకున్. 87

శా. బాలా నిన్ను మదీయజీవముగ నేభావింతు నెల్లప్పుడున్
జాలా నేఁగలుగంగ నెంతపనికిన్ సంతాపముం బొందఁగా
నేలా సిగ్గున గుట్టుఁ జేసి హృదయంబింకిట్లు చింతించుటల్
మేలా దాఁపక తెల్పు నీతలఁపు నెమ్మిం బూనికావించెదన్. 88

వ. అని యివ్విధంబున చిత్రరేఖావధూటి పలికినఁ దద్వచనౌషధంబు ప్రియానుపానసహితంబై యాత్మీయహృదయసంజనితమదనజ్వరంబు శాంతిం బొందించుటయు సేద దేఱి నిజాభిప్రాయమార్గనిరోధకంబైన లజ్జాప్రవాహంబు ధైర్యప్లవంబువలన నుత్తరించి కించిద్గళితశ్రుతి విపంచీపంచమస్వరోపమానంబగు గద్గదస్వరంబున నిట్లనియె.

తే. పాన్పుపై నొక్కనాఁడు నేఁ బవ్వళించి, నిదురవోవంగ లావణ్యనిధి యొకండు
చేరి నాయౌవనంబెల్లఁ జూఱఁగొనియెఁ, గలయనుచుఁ దోఁచు నిక్కంబు గాఁగఁ దోఁచు

సీ. సొగసైన చెక్కిళ్ళు చుంబించి చుంబించి చేరి మోమున మోముఁ జేర్చి చేర్చి
కరమునఁ బాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని
కేలి మైఁ గౌఁగిటఁ గీలించి కీలించి గళమున నఖపఙ్క్తి నిలిపి నిలిపి
చెలఁగి గళధ్వనుల్ చెలఁగించి చెలఁగించి నిద్దంపుఁ బొక్కిలి నివిరి నివిరి
తే. పోఁకముడి విచ్చి దేహంబు పులకలొదవ, నవయవంబులు గదియంగ నదిమి యదిమి
యవల నేమేమొ చేసె నయ్యాగడంబు, నెట్లు చెప్పుదు సిగ్గు నోరెత్తనియదు. 91

చ. అటువలె వానికౌఁగిట సుఖానుభవంబునఁ జొక్కి యుండి యం
తటఁ గను విచ్చి మేలుకొని తన్మహనీయవిలాసమూర్తి నా

దటఁబోడ గాననైతిఁ బరితాపభరంబున నాఁటనుండి నే
నిటువలెనున్న దానఁ గృశియించు మజీవము వానిసొమ్ముగన్. 92

చ. మదగజవైరివంటి నడుమా కమలంబులవంటి కన్నులా
యదనశశాంకువంటి మొగమా ముకురంబులవంటి చెక్కులా
మదనుని వింటి చక్కఁదనమా మధురాధర వానిరూపునా
హృదయపటంబునందు లిఖియించిన కైవడిఁ గానవయ్యెడున్. 93

తే. ప్రాణసఖివైన నీకు దాపంగ నేల, విన్నవించితి నా మదినున్న విధము
వానిఁ గన్నులఁ జూపి జీవంబు నిలుపు, మనుచుఁ గన్నీరు దొరఁగ దైన్యంబు నొందె. 94

ఉ. అయ్యలివేణి దైన్యమున కాత్మఁ గలంగుచు బాష్పబిందువుల్
పయ్యెదకొంగునం దుడిచి భక్తిమెయిన్ శిశిరోపచారముల్
సయ్యనఁ జేసి నెమ్మదివి పాదము దీఱఁగ నూఱడించి తా
నయ్యెడఁ గొంతసేపు హృదయాబ్జమునం దలపోసి నేర్పునన్. 95

శా. రంగుల్మీఱు పటంబునన్ వివిధవర్ణద్రవ్యముల్ గూర్చి సా
రంగాంకానన వ్రాసె ముజ్జగములన్ రాజిల్లు రాజన్యులం
బంగారంపు మెఱుంగు వ్రాఁతజిలుగుల్ పైపైఁ గళల్దేఱఁగా
శృంగారంపు రసంబు వెల్లివిరియం జిత్రక్రియావైఖరిన్. 96

చ కళలు వెలుంగు మోములు వికాసవిలాసముఁ జూపు కన్నులుం
జెలువము గుల్కు మేనులును జెక్కులపైఁ బ్రసరించు నవ్వులున్
దళుకులు చల్లు భూషణవితానముఁ గల్గి సజీవచిత్రముల్
నిలిపిన యట్లు వ్రాసె రమణీమణి నేర్పు వచింప శక్యమే. 97

ఆ. వ్రాఁతకాఁడు గర్త సేఁతకుఁ దాఁ గర్త, యనుట కిది విరోధమైన నేమి
సేఁతకాఁడు గర్త వ్రాఁతకుఁ దాఁ గర్త, యనుచుఁ జిత్రరేఖ ననఁగవచ్చు. 98

వ. ఇవ్విధంబున న త్రిభువనంబులం గల్గు పురుషశ్రేష్ఠుల లిఖియించిన యప్పటంబు ను
షాసుందరి ముందట నుంచి యిట్లనియె. 99

చ. త్రిభువనవాసులై వెలయు దేవమనుష్యభుజంగకోటిలోఁ
బ్రభుతయు రూపసంపదయుఁ బ్రాజ్ఞతయుం గలవారి నెల్ల నే
ర్చి భగవతీమహామహిమచే లిఖియించితి నిప్పటంబునం
దభినవమూర్తియై తగిన యాఘనుఁ డెవ్వఁడు వీరిలోపలన్. 100

వ. అని మఱియు నిట్లని వివరింపందొడంగె. 101

ఉ. దివ్యవిమానయానముల దివ్యసుగంధవిలేపనంబులన్
దివ్యలతాంతవాసనల దివ్యధునీజలకేళిలీలలన్

దివ్యవిలాసినీరతులదివ్యశరీరములన్ సుఖాత్ములై
దివ్యపథంబునన్మెలఁగుదేవతలన్వివరించిపల్కెదన్. 102

శా. ఆనందాకరవైభవానుభవురంభాద్యప్సరోనాట్యలీ
లానిత్యోత్సవుఁబారిజాతకుసుమాలంకారహారున్సుర
స్థానావాససుఖోన్నతుం ద్రిభువనీసామ్రాజ్యసింహాసనా
సీనున్నిర్జరభర్తఁజూడుమితనిన్శీతాంశుబింబాననా. 103

ఉ. ఆవహనీయదక్షిణసమాఖ్యలచేఁజెలువందిమంత్రపూ
తాహుతులన్సరోరుహభవాదులఁదృప్తివహింపఁజేసియ
వ్యాహతలీలసాధకజనాళికిసౌఖ్యములిచ్చుపుణ్యుఁడు
త్స్వాహగుణాసమానుఁడుకృశానుఁడితండిటుచూడుకోమలీ. 104

వ. అని తెలిపి వారియంద నాదరంబైన తదీయహృదయంబుఁదెలిసి శేషించినదిక్పాలక
దేవతాగణంబుల వేర్వేర వివరించెద ననుచు నిట్లనియె. 105

చ అతులితధర్మవంతుఁడుకృతాంతుఁడనూనుఁడు యాతుధానుఁడా
యతశుభుఁడంబురాశివిభుఁడంచితదేహుఁడుగంధవాహుఁడు
న్నతమతిగుహ్యకాధిపతినాగధరుండుహరుండునుంజుమీ
యితఁడునితండితండితఁడునీతఁడునీతఁడుసుందరీమణీ. 106

ఉ. కామునిమించుసుందరముకంజవనాప్తునిగెల్చుతేజమున్
సోమునిఁగేరునెమ్మొగముశోభిలువాఁడలకల్పవృక్షచిం
తామణికామధేనుసహితంబగుసంపదలింటఁగల్గుసు
త్రామునికూర్మినందనుఁడితండుజయంతుఁడునీరజాననా. 107

శా. భారాంతస్స్పృహులైననిర్జరులపైపైసోఁకియెవ్వానినిం
డారంబైకొనునర్తనాభినయభావారంభసంరంభరం
భారంభోరుముహుర్ముహుస్తరళితాపాంగచ్ఛటామాలికా
సారంబానలకూబరుండితఁడుతత్సౌందర్యమీక్షించితే. 108

సీ. కంబుకంధరవీరుకమనీయనిరతయౌవనమదోద్ధతులుగీర్వాణతతులు
సరసిజేక్షణవీరుసంగీతనృత్యవిద్యాధురంధరులుగంధర్వవరులు
కుటిలకుంతలవీరుఘుటికాంజనాదిక్రియాసుసాధకులువిద్యాధరేంద్రు
లమృతాంశుముఖివీరుసుమహితాష్టవిశేషసిద్ధిప్రసిద్ధులుసిద్ధవిభులు

తే. గరుడకిన్నరరుద్రకింపురుషసాధ్య, యక్షరక్షోభుజంగగుహ్యకులువీరు
నీకటాక్షాంచలంబులునిగుడఁజేసి, కెలనవీక్షింపుమోరాజకీరవాణి. 109

వ. అనిపలికి యనంతరంబ పాతాళలోకనివాసులవ్రాసినపటంబుఁజూపి యిట్లనియె.

మ. భవనాలంకృతనూత్నరత్నరుచిసంపన్నాంబురాజీవకై
రవకల్హారమరందపానమధుపవ్రాతస్వనోదారభో
గవతీతీరమనోహరంబఖిలభాగ్యశ్రీనివాసంబునై
ప్రవణంబొందినయట్టిలోకముగ దాపాతాళమబ్జాననా. 111

వ. తద్భువననివాసులైన నాగపుంగవులవివరించెదం గనుంగొనుము. 112

శా. పారావారవిహారియైనహరికింబర్యంకమైద్వీపశై
లారణ్యాంబునిధిప్రయుక్తమహనీయక్షోణికిన్నిల్వనా
ధారంబైయురగేంద్రలోకమునకుం దాసార్వభౌమాంకుఁడై
శ్రీరంజిల్లుఫణాసహస్రకలితున్శేషున్విలోకింపుమా. 113

చ. అతులసుధాపయోధిమథనావసరంబునమందరాద్రిక
ప్రతిహతలీలనావరణపాశలతాకృతిఁ దాల్చి దానవా
హితులకువాంఛితంబుఫలియింపఁగఁజేసినకీర్తిశాలిభా
సితసితదీర్ఘదేహుఫణిశేఖరువాసుకిఁ జూడుమీతనిన్. 114

వ. అని మఱియుం దక్షక కర్కోటకప్రముఖులైన చక్షుశ్శ్రవశ్శ్రేష్ఠుల రూపనామం
బులు చక్షుశ్శ్రవంబులకు గోచరంబుగా దృష్టంబును శ్రుతంబును గావించిన దదీ
యరూపనామంబులు వేదాంతసిద్ధవచనప్రకారంబున నాత్మకువేఱై యస్థిరంబగుట
యు దదీయముఖచిహ్నంబులవలనం దెలిసినదై తదనంతరంబ మధ్యమలోక పురుష
పరివృఢులం దెలుపందలంచి యిట్లనియె 115

చ. శుకపికశారికానినదశోభితకేళివనాంతరంబులన్
వికసితపద్మకైరవనవీనసుగంధసరోవరంబులం
బ్రకటసువర్ణగేహములభద్రగజేంద్రతురంగమాదులన్
సకలసువస్తుసంపదలసౌఖ్యదమైతగుమర్త్యమంగనా. 116

వ. ఏతద్భువనంబునంగలుగు రాజశేఖరుల నాలోకింపుము. 117

చ. నిజగజనాథయూథపదనిర్దళితోన్మదవైరిపార్థివ
ప్రజచతురంగసైన్యుఁడువిరాజితరత్నవిభూషణప్రభా
విజితవిభాకరుండుపరవీరభయంకరఖడ్గవిస్ఫుర
ద్భుజుఁడుకళింగభూభుజుఁడు తోయరుహాననవీఁడెచూడుమా. 118

చ. లలితలవంగకోమలవిలాసలతాపరిణద్ధచందనా
చలమలయక్షమాభృదసమానసుగంధవిశేషశీతలా
నిలవిలసద్గవాక్షచయనిర్మితహర్మ్యవిహారిపాండ్యుఁడీ
యలఘునిఁ జూడవమ్మదరహాససుధారసరంజితాననా. 119

శా. గంధేభేంద్రసమానయాన తెలియంగాఁ జూడుమీ నిం జతు
ష్కంధిప్రావృతమేదినీవలయవిశ్రాంతప్రతాపాబ్జినీ
బంధుం యుద్ధకృశప్రసిద్ధబలవత్ప్రత్యర్థిరాజన్యని
ర్బంధుం సాంబశివార్చనానుగుణసంబంధుం జరాసంధునిన్. 120

శా. చౌదంతిన్యగదంతి గాఁగొని సహస్రాక్షుండు యుగ్మాక్షుఁడై
మోదం బొప్పఁ ధరన్ జరించు గతిఁ బెంపున్ సొంపు సంధిల్లఁగా
వేదండోత్తమవాహుఁడై వెలయు పీఠంబ్రభాభాసమా
నాదిత్యుం భగదత్తుఁ జూడు మునితంబాభోగహేమాంశుకా. 121

శా. ప్రాజ్యంబై తగు కౌరవాన్వయమునం బొల్పొంద జన్మించి సా
మ్రాజ్యం బేలు సుయోధనుం దెలివి మీఱం జూడు మొక్కింత ది
వ్యజ్యోతిర్మయసాధనున్విహితబాహాదండకోదండదం
డజ్యానిర్యదఖండచండతరకాండప్రోద్భటాయోధనున్. 122

ఉ. తోయజగంధి చూడుము విధూతతమోగుణదివ్యతేజుఁడై
ధీయుతమూర్తియై వసుమతిన్ విహరించు పయోజబాంధవుం
డేయితఁ డంచు నెంచఁదగు ఠీవి వెలుంగుచునున్నవాని రా
ధేయుని దానవైభవవిధేయుని వర్ణితభాగధేయునిన్. 123

సీ. జయము చే ధర్మనిశ్చయము చే వైభవోదయము చేఁ దగు వాఁడు ధర్మజుండు
దిటము చే భుజబలోత్కటము చే రణజయార్భటము చేఁ బెంపొందు పవనజుండు
యుక్తిచే విబుధానురక్తిచే శరబాణశక్తిచే నధికుండు సవ్యసాచి
బుద్ధిచే నతులప్రసిద్ధిచే భాగ్యాభివృద్ధిచేఁ బొగడొందు వెలయు నకులుఁ
తే. డసమశరసుకుమారరసమనోహ, రాంగతాఢ్యుండు సహదేవుఁ డంబుజాక్షి
వీరలేవురు పాండవవీరవరులు, పెంపుసొంపార నిటు విలోకింపవమ్మ. 124

చ. సుమహితధాళధళ్యరుచిసుందరకోమలవిగ్రహంబుపై
నమలతరేంద్రనీలనికరాసితవర్ణఘనాంశుకంబుతో
నమరిన నీలమేఘురజతాచలరాజముఁ బోలె రేవతీ
రమణునిఁ జూడవమ్మ బలశాలినిఁ గోమలపాటలాధరా. 125

సీ. లలితరేఖాత్రయీకలితకంఠము వాఁడు ఘనదళవిస్తారనేత్రములవాఁడు
ఆజానులంబిబాహావిలాసము వాఁడు కమనీయనీలాలకములవాఁడు
హారశోభితవిశాలోరస్థలము వాఁడు తరుణారుణాంఘ్రిపద్మములవాఁడు
మహనీయనీలకోమలశరీరము వాఁడు నవదరస్మితసుధాననము వాఁడు
తే. సరసకల్యాణగుణవిశేషములవాఁడు, మదనశతకోటిసౌందర్యమహిమవాఁడు
దేవకీనందనుఁడు కృష్ణదేవుఁ డితఁడు, వనితగనుఁగొమ్ము నేత్రోత్సవంబుగాఁగ. 126

మ. త్రిజగన్మోహనరూపవైభవునిసాంద్రీభూతకీర్తిం బ్రతా
పజయార్కుఁ గారతికామినీకుచతటీపాటీరముద్రాకరాం
బుజునింకంఠవిలంబమానవిలసన్ముక్తామణీమాలికా
వ్రజునిన్మారటకృష్ణమూర్తియగునీప్రద్యుమ్ను నీక్షింపుమా. 127

ఉ. చక్కనివారిలోమొదలిచక్కనివాఁడగుతండ్రికన్ననుం
జక్కనివాఁడుభవ్యగుణసంపదఁదాతనుబోలువాఁడు పెం
పెక్కినకీర్తివాఁడుకమలేక్షణపౌత్రుఁడుశంబరారికి౯
మక్కువనందనుండితఁడుమానవతీయనిరుద్ధుఁజూడుమా. 128

వ. అని యివ్విధంబున నవ్వనిత యవ్విలాసినీతిలకంబునకు భూలోక పురుషపుంగవుల
వేర్వేఱ వివరించుచు ననిరుద్ధకుమారపర్యంతంబునుం జూపునప్పుడు. 129

సీ. అంగవంగకళింగబంగాళనృపులపైసారంగగతులచేఁజౌకళింప
గౌళనేపాళపాంచాలభూభుజులపైనసితటిల్లతరేఖనవఘళించి
మగధమత్స్యమరాటమద్రనాయకులపై మత్స్యపుటంబులమహిమనిగిడి
యాదవవృష్ణిభోజాంధకశ్రేణిపైయాలతేఁటిదాఁటులసెళవుచూపి
తే. మఱియుగోపాలదేవమన్మథులమీఁద, గొట్టెకోలలగతివాఁకిమిట్టితిరిగి
వ్రాలియనిరుద్ధునందుఁగ్రొవ్వాఁడిచిలుకు, ములికిగైనాసకలకంఠిబెళుకుఁజూపు.

చ. కనుఁగొనఁ గానెజల్లుమనెఁగైరవలోచనగుండెదేహమె
ల్లనుబులకించెఁగన్నులజలంబులుజాలయిపాఱెమోమునం
బెనఁగొనిదైన్యరేఖవసితగతింగరఁగెన్మనంబుము
న్ననుపడియున్నతాపశిఖిప్రజ్వలభావమునొందెవింతయై. 131

ఉ. కన్నులఱెప్పలాఁగనివికాసపుఁజూపునుమౌనముద్రతో
నున్నమొగంబునిశ్చలతనొప్పుశరీరము గాఁబటంబుపై
నున్నతలీలవ్రాసినప్రియుంగనిసొక్కనఁదానునట్లయై
చిన్నెలుదక్కియుండెసఖిచేసినజంత్రపుబొమ్మకైవడిన్. 132

తే. అతనిలావణ్యసరసియందతివచూపు, నిండుకొనిబారులయ్యెనుగండుమీలు
నప్పతిలిగుంపులయ్యెనీలోత్పలములు, పాదుకొనిమూఁకలయ్యెఁబుష్పంధయములు.

ఉ. చూచుఁజలించిపైఁబడఁగఁజూచుఁగుచంబులనొత్తిపట్టఁగాఁ
జూచునఖాలిమైఁబెనకఁజూచుసుధాధరబింబమానఁగా
జూచుఁగవుంగిటంబెనఁగఁజూచుఁగపోలముముద్దుపెట్టఁగాఁ
జూచులతాంగియమ్మదనసుందరరూపముఁజూచిభ్రాంతితో౯, 134

వ. ఇత్తెఱంగున నక్కోకకుచ తనరుచిరావలోకనంబులు పరమశాంతుని హృదయంబు
నంబోలె దత్సౌందర్యలహరీమగ్నంబై యానందలహరిం దేలుచున్న నెట్టకేలకు మర
లించి కుంభాండక తనూభవ ముఖాంబుజంబున నిలిపి యిట్లనియె. 135

ఉ. వీఁడుగదమ్మ నానిదుర వేళ ఘటించినవాఁడు కోమలీ
వీఁడుగదమ్మ పంచశరవిద్యలు చూపినవాఁడు తొయ్యలీ
వీఁడుగదమ్మ నాహృదయవిత్తము నాచినవాఁడు యుగ్మలీ
వీఁడుగదమ్మ యీ విరహవేదనఁ గొల్పినవాఁడు నెచ్చెలీ. 136

క. నిన్నుండి వీని రూపముఁ, గన్నులఁ జూడంగఁ గలిగెఁ గా నేటికి నో
క్రొన్ననఁబోఁడి రో నీ ఋణ, మెన్ని భవంబులకునైన నీఁగంగలనే. 137

వ. మేఘాగమనంబునకు నెదురుచూచుచున్న మయూరంబు విధంబున సంపూర్ణపూర్ణి
మా చంద్రబింబోదయంబుఁ గోరుచున్న చకోరంబుకైవడి, స్వాతివర్షంబు నపేక్షిం
చుచున్న మౌక్తికశుక్తిచందంబున, హృదయంగమాకారుండైన యీ రాజకుమారు
తోడి సంభోగంబునకు నాహృదయంబు నిరంతరవ్యాపారంబై యభిలషించుచున్న
యది. దురంతంబైన విరహపారావారంబు నీఁదవశంబుగాక మునుంగుచున్న నాకుం
దెప్పవిధంబున నాభాగ్యవశంబున నీవు సంఘటించితివి. ఏయుపాయంబుననైన నీత
నిం దెచ్చి మామకమనోరథం బీడేర్చి ప్రాణదానంబు సేయవలయు నిదియనుచితంబని
విచారించెదవేని నాకర్ణింపుము. 138

సీ. కలలోనఁ గన్న వార్తలకింత వలవంతకేమి కారణమని యెంచుకొంటి
నాయున్కిఁ గనుఁగొన్న నాసాటివారిలో నిది లాఘవంబని యెంచుకొంటి
మదిలోన నీమాట మఱచియుండెదఁ గాక యెంతలేదని బుద్ధి నెంచుకొంటి
గుఱుతెఱుఁగని వానికూర్మి కాశించిన నేమిఫలంబని యెంచుకొంటి
తే. నేమి సేయుదు వానికామనోజ్ఞ, వదనపూర్ణేందుచంద్రికావ్యాప్తిఁ జంద్ర
కాంతరత్నంబుకైవడిఁ గరఁగియున్న, మానమున ధైర్యమింతైనఁ బొదుకొనదు. 139

ఉ. కావునఁ బక్వబింబఫలకాంతులతోఁ దులఁదూఁగు వానికె
మ్మోవిసుధారసంబు మదిమోహము దీఱఁగ నానకుండినన్
భావభవజ్వరజ్వలనబంధురతీవ్రశిఖాకలాపతా
పావహమైన నాదు హృదయవ్యథ దీఱునె యెన్నిభంగులన్. 140

మ. కలికీ మాటలు వేయు నేమిటికి నీ కాయంబుతో వానితోఁ
గలయన్నాభాగ్యము గల్గకున్న విభునిం గాఁ జేయుమీ వీనిరాఁ
గల జన్మంబున నంచు బ్రహ్మకు నమస్కారంబుఁ గావించి యు
వ్వల దేహాంతరతీవ్రలబ్ధి కుచితవ్యాపారముం జేసెదన్, 141

తే. అనుచుఁ జెలిపల్కు ఖేదవాక్యములతోన, వేఁడినిట్టూర్పు గాడ్పులా విర్భవించె
నూరుపులతోన కన్నీరు తేఱులయ్యె, నశ్రువులతోన పరశంబయ్యె మేను. 142

తే. అతివ దురవస్థఁ గనుఁగొని యాత్మ గలఁగి, యువతి వినశత దీఱంగ నుపచరించి
యనుగుణంబైన మధురవాక్యముల మనసుఁ, జల్లజేయుచు నుండె నా సమయమునను.

వ. అని శుకుండు పలికెననినఁ దదనంతరవృత్తాంతం బెట్లయ్యె నెఱింగింపుమనుటయు.

చ. చతురవిహారహారమణిసాంద్రలసద్భుజమధ్యమధ్యని
ర్జితమృగరాజరాజసరసీరుహమిత్రసునేత్రనేత్రశో
భితవసుభద్రభద్రగజభీతిహరాదరభావభావజా
హితమతివాసవాసవమణీద్ధరుచిస్ఫుటకేశకేశవా. 145

క. దురితపరితాపపరిహర, చరితాభరితాదరాత్మశంకరహృదయ
స్మరితహరిదశ్వకోటి, స్ఫురితాస్ఫురితారినినదసంశ్రుతివినుతా. 146

భుజంగప్రయాతము. మహామంగళాకారమాస్నేహమోహా
మహాభూధరోత్సాహవారాహదేహా
గుహాత్మజ్ఞసాంచిత్యఘోరాఘదాహా
మహామంగళాద్రిప్రమాపత్సుగేహా. 147

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరాయనమంత్రితనూభవసుజనహితకృత్య నిత్యాబ్బయామాత్య ప్రణీతంబైన యనిరుద్ధ చరిత్రం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

ఉ. చీఁకటివేళ సంచరణ సేయుచు నిక్కవలైనచోట్ల న
ట్టాఁకలనిల్చుచుం జనులయల్కడుకొయ్యనలోఁగియుండుచుం
గాఁకలయూర్పులుస్సురనఁ గావిటకోటి భుజంగభావముల్
గైకొనియుండె నిందున నెకావలెనారిభుజంగనామముల్. 15

సీ. గళరవంబులురద్ది గాఁ జెలంగింపక పలుమాఱు మెల్ల నెసలుకమనుచుఁ
దమికొద్దినధరబింబముగంటువడనీక మొనపంటనొక్కింత మోపుమనుచు
గుబ్బచన్నులమీఁద గోరుతేర్పడనీక నేర్పుతో నొయ్యననివురుమనుచు
రతినుమాళమున నార్భటము గావింపక నిలుకడ చల్లఁగాఁ గలయుమనుచుఁ

తే. గాముకులయందుఁ గూర్మలుగలిగియుండి, యునురహస్యంబు బయలగున నెడిభీతిఁ
గలసిరిబ్బంగిసాంకేతికములయందు, జారకాంతలు మోహితస్వాంతలగుచు. 16

ఉ. ఆసమయంబునం గువలయప్రియమైన ప్రభుత్వరేఖను
ల్లాసరసంబు మోమునఁ దొలంగఁగఁ జల్లనిరాజటించువి
శ్వాసముతోడ లోకులు ప్రశంసలు సేయఁగఁ బూర్వశైలసిం
హాసన మెక్కెఁ జంద్రుఁడు నిజాభ్యుదయంబు జగత్ప్రసిద్ధిగన్. 17

సీ. భూనభోంతరములఁ బూర్ణీభవించు తమంబులనుచ్చాటనంబు చేసెఁ
వసతులమెలఁగు జీవంజీవవిహగ కదంబంబు నాకర్షణంబు చేసెఁ
గవగూడి చెలఁగు జక్కవల క్రీడావిలాసంబులు సంస్తంభనంబు చేసెఁ
సలిలమధ్యంబులఁ జెలువొందు కైరవారామంబుల వశీకరంబు చేసెఁ

తే. నలినపఙ్క్తికి విద్వేషణంబు చేసెఁ, దమ్మిచేరాశకలమారణమ్ము చేసెఁ
బొసఁగ వెన్నెలమంత్రవిభూతిఁ జల్లి, మహిమఁ జూపి సుధాకరమాంత్రికుండు. 18

సీ. జతనంబుతోఁ దేఁటిసంచిణీహాసము భిన్నిగుము దారుగాని గుడినడువఁ
గలువలదొరచల్ల గాలివజీరులు పూనిరాస్త్రాను చపానుగొలువఁ
బెంపువిూఱు వసంత షేషువాహుజురిననుండి చెలావణిహొనరుదెలుప
నెమ్మిఁ గోవెల నిశానీ దారుగములు కర్నా చీడమారిముల్నాదు సేయ

తే. సరణికావాలు రంగురుఘుల్ఫుటములు, రహిగ నటియించు చిలుకహిరాకి సెక్కి
కెంజిగురుసైపు కేలనంకించుకొనుచు, మదనుపాదుసహాదంఁడు గదలెనపుడు. 19

వ. అంత. 20

మ. చణబాహాబలశాలిమన్మథుఁడు చంచచ్చంచరీకచ్ఛటా
గుణటంకారరవప్రచండసుమనఃకోదండనిర్ముక్తదా
రుణచూతాంకురబాణముల్బలు పెసక్రోధాత్మఁ డైమానినీ
మణిధైర్యంబను జోడుచించుచు మనోమర్మంబులం దూఱఁగన్.

మత్తకోకిల. మత్తకోకిలశారికాశుకమంజుమోహననాదసం
పత్తికిన్ మలయాచలానిలపద్మశాత్రవచంద్రికో
ద్వృత్తికిన్ సుమహాసనాపదవిభ్రమద్భ్రమరస్వనో
త్పత్తికిన్ మదినోర్వఁ జాలక తల్లడిల్లుచునుండఁగాన్. 22

క. పగనొందుచుఁ జెలికత్తెలు, మృగమదఘనసారగంధమృదుకుసుమముల్
తగఁదెచ్చి శిశిరవిధులా, మగువకుఁ గావించి రపుడు మతియుక్తియున్. 23

సీ. విభునికాఁగిటికిఁ నై వెతఁ జెందు మేనికిఁ జందనపంకంబు లంద నేల
చందనంబునఁ గసుగందెఁ గదా యని గ్రక్కున బన్నీటఁ గడుగ నేల
పన్నీటిపలనఁ దాపంబు మించుటఁ జూచి చంద్రరజంబు పైఁ జల్ల నేల
చంద్రరజంబు చేజనియించె సెకలంచు వెసఁ దాళవృంతముల్ విసర నేల
తే. తాళవృంతములనుపడదాఁకె ననుచు, పగపఁగా నేల నేరని వైద్యుకరణిఁ
దనుగుణ మెఱుంగఁజాలక తమరు సేయు, మందులకె మందులొనరించి రిందుముఖులు.

తే. ఎన్నియుపచారములు చేసి రిందువదన, లన్నియును జూడ మనుపటికన్న మిగుల
బాధకములయ్యె దయలేని ప్రభువుతోడ, మందలించిన మనవుల చందమునను. 25

వ. ఇక్కరణి నక్కమలాక్షి విరహాతిశయంబున నోర్వం జాలక పరితపించుటకు సఖీ
జనంబులు విచారమగ్నాంతరంగలై కుసుమసాయకు నుద్దేశించి యిట్లనిరి. 26

ఉ. తల్లి సమస్తభాగ్యనిధి తండ్రి దయాపరమూర్తి నీ చెలుల్
చల్లనివారు నీవు కడుఁ జక్కనివాఁడవు పొంకమైన నీ
విల్లు సమాధురింబరిఁష విల్లు మృదుత్వము నీదు వర్తనం
బెల్లన యోగ్యభావగుణ నేటికి రోయవు మీనకేతనా. 27

చ. పురహరదేవునిం జెనకఁబోయి తదుగ్రలలాటనేత్రభీ
కరదహనార్చులం గలసి కాలితి వంత టనుండి యైనను
బరులను బీడపెట్టని కృపాగుణ మేటికి లేదు నీకుఁ గా
పురుషులు రాజదండనముఁ బొందియు నైజము మానరే కదా. 28

వ. అని పలికి సుధాకరు నుద్దేశించి. 29

సీ. కువలయంబులను గన్గొన్న చల్లని చూపు కమలబృందములందుఁ గలుగ దయ్యె
నలచకోరములపైఁ గలుగు దాక్షిణ్యంబు జక్కవగములందుఁ దక్కనయ్యె
స్వప్రాణవిభులైన సతులపైఁ కూర్మియ నాథకాంతలయందు నాస్తి యయ్యె
నిందూపలములపై నెనయు సౌహార్దంబు రవికాంతములయందు రహితమయ్యె
తే. బక్షపాతంబు మాన వేపక్షమునను, రాజదోషాకరుఁడవు గా రామరామ
దానఁ జేసి సుమీ! నీదు మేనియందు, నంక మై నిల్చియున్న దయ్యపయశంబు. 30

క. పగలొప్పనిసౌమ్యతనై, జగుణంబగునీకునింతచలమేటికయో
తగుపూర్ణకళానిధితో, మొగమెఱుఁగనివాఁడవాకుముదినీరమణా. 31

వ. అని మలయపవను నుద్దేశించి. 32

శా. ఎంచంజల్లనివాఁడవై సరసులందిష్టంబువాటించుచుం
బంచప్రాణములై మెలంగుదువుమాపద్మాక్షియందిట్లుబా
ధించంజొచ్చితివిద్యోడన్మరునిబుద్ధిన్నీస్వభావంబువ
ర్జింపంజెల్లునెనీగుణంబుగదదాక్షిణ్యంబుమందానిలా. 33

వ. అని పికశుకనికరంబుల నుద్దేశించి. 34

క. ఒకకుతికై యుండెడుమీ, రకటాచెలియెడలనింతయతికూహకమా
పికమాశుకమాయికమా, నకమాసుకుమారగాత్రినాయమెయేచన్. 35

వ. అని పలుకుచున్నసమయంబునం జిత్రరేఖం గనుంగొనియుషాంగన తన మనోహరుం
డైనయనిరుద్ధుని సరససౌందర్య సౌకుమార్యంబులు పలుమారుఁ బ్రస్తుతించుచు.
నిట్లనియె. 36

ఉ. ఔనటవమ్మవానిసరసాధరసారరసామృతంబు నే
నానకయుంకతాళఁగలనాలలనాకలనాదకీరసం
తానముసేయురంతుముదితామదితానదితాపమయ్యెస
న్నానవిధంబునీదెగదనాయెదనామదనాభుఁజేర్చినన్. 37

వ. అనిపలికిన. 38

చ. విరహమునొందకమ్మవిభువేగమెతోడ్కొనివత్తునంచునా
సరసిజగంధియోగబలసంపదచేగగనప్రచారయై
యరిగెననేకపట్టణవనాచలశైవలినీచయంబుస
త్వరవిభవంబునంగడచితానటయేఁగుచుఁగొంతదవ్వునన్. 39

శా. కాంచెంగాంచనగాత్రిసౌధశిఖరాగ్రస్వర్ణపాంచాలికా
చంచన్నీలమణిప్రకల్పితకచప్రక్షిప్తభవత్తారకం
బంచోదంచితహృద్యవాద్యరవశుంభద్వ్యోమపూజాలస
త్కాంచిచామిత్రగురుస్తమంటపసహస్రస్ఫారకద్వారకన్. 40

వ. కనుంగొని మనంబునఁ బెనంగొను ప్రమోదంబునఁ బ్రమాదంబగు విద్యావిశేషంబున
నన్నగరంబుఁ బ్రవేశించి సముంచితప్రాసాదరేఖా పురోభాగ మహోన్నత స్తంభా
గ్రవిరచిత దేదీప్యమానదీపికాకదంబక ప్రతిబింబవిడంబితసాంద్ర చంద్రశాలాస్థగి
తపద్మరాగ మణిగణ చరణారుణకిరణస్ఫురణవలన నిశాసమయంబయ్యును దివాభా
గంబునంబోలెదృగ్గోచరంబగుతదీయ సౌభాగ్యంబునకు నాశ్చర్యంబునొందుచుంగ
లితకాంచనకనత్కవాట కమనీయ చతుర్ద్వార చారుతరప్రాకారంబును, మహోగ్ర

సాధనసమగ్రజాగ్రద్వీరభటసమూహ సమావృతంబును, రుక్మిణీసత్యభామాప్రముఖాష్టమహిషీషోడశసహస్రసుందరీసందోహమందిరామందసుందరంబును, బద్ధరాగవజ్రవైడూర్యగోమేదికపుష్యరాగ మరకతనీలముక్తాప్రవాళ ఖచిత స్తంభకుడ్య వాతాయనవితర్దిప్రదేశంబును, ప్రద్యుమ్నసాంబసంకర్షణసుధేష్ణాది కుమారవిహారసౌధయూధాభిరామంబును, సకలసౌభాగ్య లక్ష్మీనివాసంబునునగు గోపికావల్లభుమందిరంబునం బుశ్శృంగారంబునకుసారంబును, విలాసంబునకువాసంబును, భోగంబునకుయోగంబును, భాగ్యంబునకుయోగ్యంబును, స్తోత్రంబునకుఁబాత్రంబునునై, సహస్రభానుప్రభాభాసమానంబగు ననిరుద్ధకేళీసౌధంబులోపలం బ్రవేశించియందు.

క. అలరుక్మలోచనాకుచ, కలశయుగాన్వితనిరూఢగాఢాశ్లేషో
జ్జ్వలపులకాంకితదానవ, సలలితసురతప్రసంగజనితశ్రముఁడై. 42

సీ. బంగారుదివియకంబములపైనిరువంక దీపికాకాంతులు తేజరిల్లు
నవలమాణిక్యపర్యంకభాగంబునఁబరువంపుజాజిపూఁబాన్పుమీఁద
నొకకేలుతలక్రిందనునిచి రెండవకరంబూరువుపైఁజాచియొత్తగిల్లి
పరువుపైముత్యాలసరులుకుప్పవడంగఁజెలిదమ్మితళుకుకన్నులు మొగిడ్చి
తే. పూఁతనెత్తావిగమ్మునఁబొలయుచుండ, నూర్పులొక్కింతముదురులై యుప్పతిల్ల
నిదురపరవశముననున్న యదుకుమారుఁ, గాంచెఁదనగొప్పకన్నులకఱవుదీఱ. 43

ఉ. మీసముతీరుఁజూచిజిగిమేనిపటుత్వముఁజూచిమోములో
హాసముఁజూచిచేతులయొయారముఁజూచిమనోజ్ఞరూపరే
ఖాసమలీలఁజూచియహహాయనుచుందలయూచిముందుదా
వ్రాసినభావమెంచితలవంచుకొనెన్జలజాక్షిసిగ్గునన్. 44

వ. తదనంతరంబ. 45

మ. తనసమ్మోహనవిద్యచేజనులనిద్రాముగ్ధులంజేసియ
య్యనిరుద్ధుంగొనిఖేచరత్వముననుద్యద్వేగయైయేగిబా
ణనిలింపాహితరాజధానియగుశోణాఖ్యంబ్రవేశించియ
వ్వనజాతాక్షియుసాలతాంగిసుషమావత్సౌధముంజేరఁగన్. 46

వ. వచ్చుచున్నసమయంబున. 47

ఉ. ఎప్పుడువచ్చునోకువలయేక్షణయాతనిఁదోడుకొంచునే
నెప్పుడుచూతునోసదమలేందునిభంబగువానిమోమునా
కెప్పుడుగల్గునోయతనినింపుగఁగూడెడుభాగ్యమంచునా
కప్పురగంధితాపమునఁగంటికినిద్దురలేకవేఁగుచున్. 48

ఉ. నావెతచూడలేకకరుణాపరురాలగుచిత్రరేఖదా
నావిభుఁదెత్తునంచునకటాపరభూమికిసాహసంబునం

బోవుచునుండెనొకో యకటఁబోయిన కార్యమునిర్వహింపరో
దేవతలార నాదిగులుదీఱఁగ మీకు నమస్కరించెదన్. 49

వ. అనితలంచుచు. 50

తే. తరుణియిబ్భంగిఁ గుసుమకోదండచండ, కాండనిర్భిన్నహృదయయై కరఁగుచున్న
యవసరంబున రతిమనోహరకుమారుఁ, దెచ్చి పానుపుపైనుంచె మచ్చెకంటి. 51

వ. అప్పుడు. 52

చ. హృదయము ఝల్లుఝల్లుమన నెంతయు విస్మయమంది చూచి పెం
పొదవిన భ్రాంతిచేత నిదియుం గల గాదు గదా యటంచు నె
మ్మదిఁ దలపోయుఁ గ్రూరుఁడగు మారుఁడు చేసిన యింద్రజాలమో
యిదియని యంచుఁ బర్వ్వరజనీందుకళానన మోహితాత్మయై. 53

వ. అంత. 54

క. తెలివొంది చిత్రరేఖా, కలవాణిం గౌఁగిలించి కన్నులహర్షా
శ్రులు జడిగురియఁగఁ దనువునఁ, బులకాంకురముల్జనింపఁ బొంగుచుఁ బలికెన్. 55

ఉ. ఈసుకుమారమూర్తి నిపుడీడకుఁ దెచ్చితి ప్రాణదానముం
జేసితి నీకు మేల్మరలఁ జేయఁగ నేర నమస్కరించెదన్
నీసుగుణంబు నీ వెనరు నీయుపకారము ముజ్జగంబులన్
వానికి నెక్కు నీకథలు వర్ణితమయ్యెడుఁ గాక కోమలీ. 56

క. అనిపలుకుచున్న బాలిక, వినయోక్తుల గారవించి వేడుకతోడం
జనియెను నిజమందిరమునకు, వనజానన యుండె నిచటి వాంఛలు మీఱన్. 57

ఉ. లేచుట యెప్పుడో నిదుర లేచిన పిమ్మట నన్నుఁ గన్నులం
జూచి మనోనురాగమున సొక్కి కవుంగిట గారవింపఁగాఁ
జూచునొ లేక నా మమత సుద్దియె యుంగమిఁ జేసి వింతయై
తోఁచుచునుండునో యితనితో నపుడేమని పల్కుదానొ. 58

మ. అనిచింతింపఁగ నిద్ర మేల్కని యతం డాకర్ణవిశ్రాంత మో
హననేత్రాంబుజముల్కనీనికలచాయార్ద్రేరఁగా విచ్చి చూ
చిన యా చూపు మనంబునం దగిలెఁ గించిన్మధ్యకున్నాభవిభూ
ధనురుద్యత్కటకాముఖాంకకరసంధానప్రయోగాస్త్రమై. 59

ఉ. నాథుసుదర్శనంబువలనన్ మదనగ్రహమోక్షమయ్యె బిం
బాధరకున్ సుదర్శనమహామహిమం బిటువంటిదేకదా
యీధరఁ దత్ప్రయోగమున నెట్లు గ్రహంబులు నిల్వనేర్చుఁ ద
త్సాధకులైన మాంత్రికులు సారె మెఱుంగుదురప్పుడిప్పుడున్. 60

గీ. ఇవ్విధంబున మేల్కాంచి యవ్విభుండు, ద్వారకాపురకనకసౌధప్రదేశ
చారుతరరత్న పర్యంకశాయి గాఁగఁ, దనుదలంచుచు లేచి కన్గొనెడునపుడు. 61

సీ. కాఁకలు దేరు బంగరుసలాక యనంగఁగ నటువాసిన చంద్రకళ యనంగ
నదను బుల్కడిగిన యట్టిముత్య మనంగ సానఁ బట్టిన కాముశర మనంగ
మెలపుతో నిల్చిన మెఱుపుతీఁగె యనంగ నసకంబు వోసి క్రొన్ననయనంగ
జీవకళల్గల చిత్రరూప మనంగఁ బరువంబు దప్పని విరి యనంగఁ
గరగుననుబోసి మోహనాకారగీరేఖ, యొసఁగ దీర్చిన శృంగారరస మనంగఁ
దనసమీపంబునందున తరుణిఁ జూచి, మన్మథకుమారుఁ డాశ్చర్యమగ్నుఁ డగుచు. 62

క. మొదలను నేవసియించిన, యదిద్వారకలోనివజ్రహర్మ్యము గాదా
యిదియేమి వింతయిపుడిది, సదమలమాణిక్యఖచితసౌధంబయ్యెన్. 63

వ. అని విచారించుచు నవ్వరారోహ నాలోకించి. 64

సీ. సౌలఁతి మోమునకు సంపూర్ణేందుబింబంబు వెలయ నివాళి గావింపవచ్చు
శంపాంగి మేనికిఁ జాంపేయపుష్పముల్వరుసతో బడిసి వైవంగవచ్చు
జలజాక్షికురులకు జాతినీలంబుల నొగిదృష్టి వేరు గానుకవచ్చుఁ
గలకంఠకంఠిపీనులకు శ్రీకారముల్ రక్షయంత్రములు గావ్రాయవచ్చు
నౌర యీరూపవతికి రంభాదివేల్పు, చెలులనడిగంపుబుడుతలఁ జేయవచ్చు
ననినదోషంబు గలుగదీ యర్థమందుఁ, జూడ మెన్నఁడు నిటువంటి సుందరంబు. 65

గీ. అని విచారించు నెడఁ గించిదవనతాస్య, పద్మయై తనకై ప్రేమ బయలు పఱుచు
కలికి నిడువాలు తళుకుఁ గన్నులను బెళుకు, చూపులను జూచుచున్న యా సుదతి కనియె. 66

ఉ. ఎవ్వరిదాన వేకువలయేక్షణ యెయ్యది నీదు పేరు నీ
వెవ్వనిమేలు దానవిపు డేమికతంబున నన్నుఁ దెచ్చితీ
వివ్వరసౌధదేశమునకింతయుఁ దాఁచక తెల్పు నా వుడున్
నవ్వును సిగ్గుఁ గూడి వదనంబున దాఁగిలిమూఁతలాడఁ గాన్. 67

గీ. తళుకువజ్రంపు జవజయందంబు గులుకు, పలుకుగురు తేటముకురబింబములవంటి
చెక్కుఁగవనిండి కెంపుల చెక్కడంపుఁ, గమ్మలను గ్రమ్మఁ బలికె నా కలికి యపుడు. 68

మ. ఇది బాణాసురుపీడు శోణపుర మా యింద్రారి మాతండ్రి పెం
పొదవెన్నానుషాభిధాన మొగి నీయొయ్యారపున్ రూపుస్వ
ప్నదశం గాంచిన దాన నై విరహసంతాపంబునం జెందన
మ్మదలీలన్నిమఁ దెచ్చెఁ బ్రాణసఖి శుంభద్యోగవిద్యోన్నతిన్. 69

ఉ. కన్నియఁ గాని యన్యసతిఁ గాను శరీరము నీదు సొమ్ము గా
నున్నన చేసియేలుకొనుమా వినుమా యనుమానబుద్ధిపై

వన్నెలయించెదేనిరమణాయిక నేమనుచాననిన్నునా
కన్నులఁజూడఁగల్గెఁగదకాఁగలయట్లగు దైవయోగముల్. 70

వ. అనిపలికి యక్కాంత చింతాసముద్రాంతర్మగ్నాంతరంగయై తలవంచుకొని యూరకుండె నప్పుడు. 71

సీ. తొలుత నాతనిరూపుఁ గలఁ గన్న యాదిగా మగువకుదినము లేయుగములయ్యెఁ
బటముపైనతనిరూపముఁ జూచినది మొదల్ మగువకుజాములేయుగములయ్యె
సఖివానితోడి తేఁ జనినయంతట నుండి యువిదకుగడియలేయుగములయ్యెఁ
దరువాత నతఁడు నిద్దురలేచునంతకు యువతికి నిమిషముల్ యుగములయ్యె
తే. నతఁడు గౌఁగిటఁ గదియించునంతలోన, నుత్పలదళాయతాక్షికి నొక్కొక్కక్షణము
యుగసహస్రంబులై తోఁచుచుండె నపుడు, వనితమకంబుఁ దెలుప నెవ్వరివశంబు. 72

చ. పలుకులలోని ప్రార్థనయు భావములోఁగల తెంపు మోములో
వెల వెలచూపులోఁ బొడమువిన్న నయూర్పులలోపణంకుని
మ్ములఁ బొడగాంచి యుష్మదన మోహానుఁ డెంతయు సంతసించెఁ దా
వలపులమర్మము ల్దెలియవచ్చుఁ గదా ఘనులైనవారికిన్. 73

వ. అప్పుడు. 74

సీ. అకలంకచంద్రబింబాననయూరు దేశంబుల వెంట సంచరణచేసి
కోమలాంగినితంబభూమండలమునకుఁ గ్రమముతోడఁ బ్రదక్షిణములొనర్చి
మృగనేత్రగంభీరమగు నాభిసరసిలో నవగాహనక్రీడ లాచరించి
గంధసింధురయానకఠినకుచోత్తుంగశైలాగ్రమునఁ బునశ్చరణసలిపి
తే. పడఁతిమందస్మితసుధానుభవతననిమి, షత్వమును గాంచెఁ గానిపాంచశరిచూపు
లపున రావృత్తిమోక్షంబునందవయ్యెఁ, గాముకులపుణ్యములు భోగకారణములు. 75

సీ. తనువులదిగుపాలుకనుదోయి బెళకుముత్యాలరాసులుతలఁ బ్రాలుచేసి
తూరుదుండెములాడుతోడవులరుచిదీపకళికలుమంగళార్తులుగఁ జేసి
యలఁతఁజిప్పిలుఘాలములఘర్మజలము మొగ్గలగుంపుతెగుబానీకములుచేసి
పొదివి మేనులఁ దోఁచుపులకాంకురంబులుతుకముజాజాలపాలికలుచేసి
తే. సంప్రకాశించువిరహాగ్ని సాక్షిగాఁగ, బాణకన్యానిరుద్ధులపరిణయంబు
నర్థిగావించె మకరమీనాధిపతుల, యదను దెలిసిననవివంటియాప్తుఁ డుండు. 76

క. లలనామణికప్పుడుగు, బ్బలపొంగున బిగిసియవికపట్టు.. నఁబగిలె
జిలుకరహదారురాహుత్తు, తలిరాకుపిరంగివిసరుదాఁకెనసంగన్. 77

మ. రమణింగౌఁగిలించి పయికిఁ గాఁ దీయుచోఁ గల్లనం
గమనీయాంగద హేమకాంచరశనాఘంటారవంబుల్మిషే

కముహూర్తంబిదియంచుఁదెల్పుచుమహాకందర్పమౌహూర్తికా
సముహస్తాయసదండభిద్భవఘనాంచల్లోహయంత్రాకృతిన్. 78

ఉ. కాంచనగాత్రిముగ్ధవగఁగాంచికవుంగిటఁగుబ్బలంటఁగీ
లించిసుధాధరంబుఁగబళించిహసించికపోలపాళిఁజుం
బించిచమత్కరించిపలపించికళల్గరఁగించిమించిసో
క్కించికమన్నఖించికిలికించితకేళిరమించెవేడుకన్. 79

సీ. సురుచిరాంబరబంధవరణంబుభేదించివ్రీడాబలంబులవిఱుగఁదోలి
ఘనకుచశైలదుర్గములగ్గలుపట్టిజఘనవసుంధరాచక్రమాఁగి
యూరూరుసంయుక్తతోరణంబులఁగట్టిచతురుఁడైమధ్యదేశంబుఁబొదివి
యంగాంగములుభుజాహంకృతిలోఁగొనియానఖండారమాక్రమించి
తే. సురతసంగతిజయలక్ష్మిసారిదిగాంచి, తరుణికౌఁగిలినిజరాజధానిగాఁగ
నెలమిమన్మథసామ్రాజ్యమేలుచుండె, సిద్ధసంకల్పుఁడయ్యనిరుద్ధవిభుఁడు. 80

ఉ. చంచలలోచనన్సురతసౌఖ్యమునన్గరఁగించెనంచువ
ర్ణించఁగనేటికిన్వలపుఁబేరురులొండ్లిజగంబువారిమె
గ్గించెడివానిపెద్దకొడుకేయఁటరూపవిలాసవైఖరి
న్మించినయింతికిన్వలవనేరఁడొతాపలపింపనేరఁడో. 81

సీ. జలచరనేత్రకన్నులవెరపింపుకేరయొత్తినబిరుదాంకమేటఁగలిపి
కార్ముకభ్రూయుగకనుబొమ్మనంపుకేపట్టినవిల్లునిష్ఫలముచేసి
లలితశుకాలాపపలుకుజంకెనలకేమావులవందంపపోవఁదోలి
చెలఁగుపల్లవపాణిచేగద్దికలకెక్కుపాణంబులడవులపాలుచేసి
తే. ప్రియునిసాహాయ్యమునవిజృంభించుచున్న, వెలఁదితోవిగ్రహింపనవేళయనుచు
సమరరంగప్రచారంబుసన్న్యసించి, యంగజుఁడుకార్యమెఱిఁగిసమాశ్రయించె. 82

చ. వలచినపొందులైమనసువచ్చినచక్కఁదనంబులైభ్రమల్
కొలిపెడియౌవనంబులయికూరుములద్దినక్రొత్తలైకళల్
దెలిసిననేర్పులైకొదవలేకరమింపఁగఁగల్గినట్టియా
చెలువుఁడునింతియుందొలుతఁజేసినపుణ్యఫలంబులెట్టివో. 83

గీ. అంతనానవోఢయానందమునఁదను, సురతమునజయింపఁబరిభవంబు
నొందియున్నయట్టికందర్పవదనంబు, తెల్లనారనట్లుతెల్లవారె. 84

ఉ. చిందఱవందఱైయసురసేనలుడిందమునన్భయాకులం
బందిపతంగపుంగవశతాంగరథాంగమహోగ్రధాటినం
దందఁగుడంగినట్టులుదయాద్రినిరాకనదంగెఁజీఁకటుల్
గొందులసందులన్గుహలగుట్టలబుట్టలచాటుమాటులన్. 85

శా. ప్రాతఃకాలమహాబలాఢ్యుఁడు నిశాప్రత్యర్థివీరుం బరా
భూతుం జేసి సమస్తదిగ్విజయుఁడై పూర్ణప్రభావ ప్రభా
ఖ్యాతిం గైకొని యున్నవేళ జయతూర్యంబుల్ చెలంగించిన
ట్లాతర్వాతఁ జెలంగెఁ గుక్కుటసముద్యత్కూజనానాదాగ్భటుల్. 86

వ. మఱియు నాసమయంబునం బ్రణయకలహవ్యాపారంబులం బరిశ్రాంతులై మానము
ద్రలువహించి పరస్పర తనుస్పర్శనంబులుగాక యుండ నేకశయ్యం బవళించియుండి
యు మకరధ్వజుండు మండలీకృతకోదండుండై ప్రయోగించు కుసుమకాండంబు
లం బొడము హృదయవ్యథలం బొరలుచుండియు నాభిమానికంబులం దెచ్చుకోలు
ధైర్యంబులనుండియు సూచితాహఃముఖంబులైన తామ్రచూడకంఠనినాదంబులు కర్ణ
కఠోరంబులై వినంబడిన నులికిపడి దిగులొందుచుఁ బంతంబులు విడిచి మనంబులు గరంగి
కుహనానిద్రావసాన పరివర్తితాభిముఖశరీరులై యొండొరులం గౌఁగిలించుకొని తమ
కపుఁగూటములం దనుకపుసారతులకు నవకాశంబులేని ప్రొద్దువిచారించు మొకరినొ
కరి దూఱిపలుకుచు నిట్టూర్పునిగుడించి దంపతులవలనను నరవిందబృందంబులతోడ
వికసితంబులగు హృదయారవిందంబులం దనుకనామునియైన యవ్వేళ చుంబనపరి
రంభణ నఖదంతక్షతాదివినోదంబులం బంకజాసనార్థ పంకజాసన రతిబంధసౌఖ్యం
బులం జొక్కు పద్మినీ పాంచాలురవలనను శారికాకీరమయూర కలకంఠ కలరవకపోత
కలహంసప్రముఖంబులైన విహంగమనివహంబుల కలకలంబుల మనోహరంబులై నెల
యు లవంగక్రముక చాంపేయపున్నాగ నారికేళ చందనమందార కదంబఖర్జూరాది
మహీరుహంబులం బ్రశస్తంబులగు నుద్యానవనంబులవలనను దేవభూపాలమందిరం
బులయందు భగవత్కీర్తనంబులు సేయు వైణవికమార్దంగికాది గాయకనికరంబుల
జంత్రగాత్రంబుల సుస్వరంబులగు భూపాల దేవగాంధారి మలహరి దేశాక్షి వసంత
మంగళకౌశిక ప్రముఖ స్త్రీపురుషరాగస్వరగ్రామంబుల నభిరామంబులై ధ్రువమఠ్యా
కాదితాళంబుల మేళంబులగు సంగీతనాదంబులవలనను స్నానసంధ్యావందనా
ద్యనుష్ఠానంబుల నిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణసమూహ సంకీర్ణంబులైన జలాశయస్థానం
బులవలనను గోపాలకులు నిజనామాంకంబులంకించి పిలుచుచుం గ్రేపులవిడుచు
సన్నాహంబుల సంభానినాదంబులు సేయుచు హుంకారంబులతోడ వదనంబులెత్తి
కర్ణంబులు నిక్కించి తమతమవత్సంబుల కెదురుసూచు ధేనువితానంబులవలనను
దీర్ఘికాతరంగడోలాజాలంబులఁ నీఁదులాడుచు నినాదంబులొనరించు మరాళ
బలాకచక్రవాక జలకుక్కుటాదిపక్షికదంబంబులవలనను వర్ణనీయమై భవసమేతంబై
ప్రభాతంబు వర్తించెనంత. 87

తే. గగనవీథినివాహ్యాళిఁ గదలుపద్మ, బాంధవప్రభుముందరఁ బట్టుసూర్య
పుటముగొడుగులపడగలప్రోవసంగ, నమరఁ గెంజాయ ప్రథమదిగంతరమున. 88

మ. తమముం బాయఁగఁజేసిరాగగుణముందప్పించిసన్మార్గవ
ర్తిమతంబొప్పఁదపంబు పెంపునవర్ధిష్ణుత్వముం గాంచిలో
కములెల్లంగనుగొంచుసజ్జనమనస్కారార్ఘ్యదానంబులం
బ్రమదంబొందివెలింగెయోగికరణింబ్రద్యోతనుండయ్యెడన్. 89

వ. అప్పుడు. 90

శా. గోరుల్నాటినగుబ్బచన్నులనుజిక్కుల్వడ్డహారావళుల్
జారంజెమ్మటముద్దుఁజెక్కులనుస్రస్తంబైనధమ్మిల్లముం
దీరైనిద్దురదేరుకన్నులునునాతింజూడనవ్వేళనొ
య్యారంబుల్విభునాత్మఁగైకొనియెమోహభ్రాంతిరెట్టింపగాన్. 91

సీ. అకలంకరాజబింబాననంబులయందునిదురతిమంబులుముసురుకొనఁగఁ
దాంబూలరాగసుందరమైనమోవులు మొనపంటినాటులముద్దుగులుక
వీడిచిక్కులువడ్డవేణీభరంబులుజాతినీలంబులచాయలీన
ఘర్మబిందువులచేఁగరఁగినమైపూఁతమృగనాభివాసనల్బుగులుకొనఁగ

తే. నొకరొకరిఁజూచునరసిగ్గుటోరచూపు, దగిలియున్నట్టిప్రేమబంధములముళ్లు
బిగువుగొలుపంగఁ బ్రేయసీప్రియులుకేళి, శయ్యపైడిగ్గిసమ్మదస్వాంతులగుచు. 92

క. కాలోచితకృత్యంబులు, లీలంగావించిసరసలేపనసుమనో
మాలాంబరభూషణజా, లాలంకృతగాత్రులగుచునతిమోదమునన్. 93

వ. ఇవ్విధంబున నవ్వధూవరులు ప్రాణంబులకంటె నతిశయంబగు విశ్వాసంబుగలుగు చిత్రరేఖాముఖకతిపయపరిచారికాసహాయులై యితరజనంబులకెవ్వరికిం జేరరాని రహస్యమందిరంబున నిఘోషప్రవర్తనంబులనిచ్ఛానుగుణంబులైన సరససల్లాపంబులం జెలంగుచు, శృంగారవనవాటికల మెలంగుచు, సరసాహారదుకూలచందనకుసుమాది భోగంబులం బ్రమోదించుచుఁ, గంజకైరవకల్హారకమనీయకమలాకరంబులఁ జలక్రీడావిహారంబుల వినోదించుచు, గ్రామ్యవేణుదారితఝల్లరీముఖేంద్రాణిజృంభితాదికరణంబులస్త్రీపురుషరూపంబులఁజిత్రించినకేళిచిత్రపటంబు లవలోకించుటవలనఁ గూటములకుఁ గ్రొత్తతెకంబుసంపాదించుచు ముచ్చటలంగలయుచు, సురతజనితశ్రమంబులసొలయుచు, నిదిరాత్రి యిదిదినంబని తెలియనియ్యని మోహాతిశయంబుల దేహంబులు జీవంబులు నొక్కటిగాఁ దలంచుచు, దినంబులు క్షణంబులగతిం గ్రమించుచు నవాఙ్మనోగోచరంబైనయానందపారావారంబునం దేలుచుండిమఱియొక్కనాఁడు.

సీ. అలఁతఁబాపెడునవ్వటమ్మృతంపుఁదేటలచిలుకరింపులప్రేమతొలకరింప
వీనులనరసోఁకువీడ్యంపుఁదావులపలుకరింపులమేనుపులకరింప
సురతంపుటిరవులసొంపునింపుపిఱుందుచెంగలింపులమేనుదొంగలింప
విడిచియువిషఁజాలకెడతొఁకసిగ్గుమోమోరసింపులయింపుదారసింపఁ

తే. గలికి తేలింపుఁ జూపులఁ గరఁగి కరఁగి, సొలపు సెయ్యంపుఁ జిన్నెలఁ జొక్కి చొక్కి
యివ్విధంబున నాయకుఁ డింపువడన, యుపరిసురతసుఖాంబుధి నోలలాడె. 95

సీ. క్రమ్మ విరచులాననిమ్మని విభుఁ డేఁడుకొనినఁ గొమ్మనియాసకొలిపియాన
వచ్చిన నియ్యక వదన మిట్టటుఁ ద్రిప్పి యలయింపఁ గాఁ గోపమగ్గలించి
కరములఁ జెక్కిలిగవ యొత్తిపట్టి పంటను మోవిఁ గొనిచు నుక్కనఁగ నొక్కి
యిటువలెఁ జేయక మెన్నటికిఁ గనని దట్టించి చెక్కిలి గొట్టునపుడు
తే. కంకణంబులరావంబు గల్లుమనియెఁ, జేతియురవడి తాఁకునఁ జెళ్లుమనియె
నల్లభుని మేనఁ బులకలు జల్లుమనియెఁ, గుసుమశరుమూఁకనవ్వులు గొల్లుమనియె. 96

మ. సిచయాభావనటన్నితంబతట యోషిద్రత్నకించిచ్ఛల
త్కుచపాటీరరసార్ద్రఘర్మజలబిందుస్వచ్ఛముక్తామణి
ప్రచయాంచత్స్తననాభిరాము సుమహోబాహాంతరుం డై సుఖిం
పుచు మెచ్చెన్ రతిరాజనందనుఁడు తత్పుంభావసంభోగముల్. 97

సీ. విల్లెక్కుడించక వేసినమదనుండు పలుమాఱుకుంటెనపనులు నడప
సెగలచే స్రుక్కఁ జేసినమందపవనుండు చెలిమితో నెస్మెని చెమటలార్ప
నుదుటు వెన్నెలకాఁక నుడుకఁ జేసినచంద్రుఁ డమరి శైత్యోపచారములు సేయఁ
జెవులు గాసిలరొదల్చేసినచిలుకలు ముద్దుమాటలు పలికి ప్రొద్దుఁ గడప
తే. శుకకలాలాపప్రాణనాయకునిఁ గూడి, నిందువేడుక విహరించుచుండె నపుడు
మేలుఁ గలిగి సుఖించెడి వేళయందు, భువిని బగవారలైన బంధువులు గారె. 98

క. ఎక్కువలగు మక్కువలను, జక్కవలను బోలి యిట్లు సరసత నెలవా
ల్లిక్కువఁ గలిసియుండఁగ, నక్కువలయనేత్ర గర్భ మయ్యెడఁ దాల్చెన్. 99

తే. చక్రభావనచేఁ గాంచి శక్తిదనకుఁ, బ్రాపుగలుగుటనో లేమిఁ బాపుకొనియె
వెలఁదినడుమంతమాత్రనే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁగల్మి కదినిజంబు. 100

మ. అసమాస్త్రుండను గారడీఁ డతిపగర్భాయాసనిశ్వాసమం
త్రసముచ్చారణ సేయ నాభివివరాంతస్సీమయందుండి సా
హసభావంబున నిర్గమించి సఫణంబై యాడు నీలాహి రీ
తి సరోజాననరోమరాజి చెలువొందెం జూడ నవిస్తీర్ణమై. 101

ఉ. మెల్లని కౌఁగిలింపులును మెత్తని మాటలు లేఁతముద్దులుం
జల్లని చూపులుం గులుకుఁ జల్లెడు నవ్వులు నేర్పుగల్మి యుం
జెల్లని హామికల్లరువు సేయని కూటములయ్యె భావముల్
వల్లభునందు వేఁకటి యలంత నెలంతకు నాఁటినాఁటికిన్. 102

సీ. ఉరువులై కొనలనల్లొప్పు చన్నులు కరగ్రహణతకొకవింత కాంక్షఁ జేయఁ
తెలిదమ్మిచాయలు దేరుచెక్కులు ముద్దుఁ గొనుటకు నొకవింత కోర్కె వొడమ

నలపుసొల్పులఁబల్కు పలుకులువీనులవినుటకునొకవింతవేడ్కయొదవఁ
గమ్మనివాసనల్ గ్రమ్మువాతెరతేనెలానుటకొకవింతయాసఁగొలుప
తే. మెత్తనైమెఱుఁగెక్కినమేనుకాఁగి, వింతకొకలింతముచ్చటసంతరింప
గర్భిణీరతజనితసౌఖ్యమునఁజొక్కి, చుండెనవ్వేళయసురవంశమండనుండు. 103
వ. అంత. 104
ఉ. మందిరపాలికాజనులు మానినిఁగన్గొనిగర్భభారమే
చందమునన్ఘటించెననిసంశయమున్భయమున్విచారమున్
డెందమునన్జనింపఁగవడింబఱతెంచిరమాస్యరీతిసం
క్రందనవైరితోడవివరంబునవిట్లనిపల్కిరత్తఱిన్. 105
చ. చెలఁగిభవత్తనూభవవసింపఁగృహాంతముపోతుటీఁగెయున్
బొలయకయుండఁగాఁచుకొనిపూనికనుండఁగనేమిమాయయో
తెలియఁగఁజాలమమ్మదవతీమణిగర్భభరంబుఁదాల్చెని
న్నేళవుగృహంబులోపలనునిక్కముగావివరింపఁగాఁదగున్. 106
వ. అని విన్నవించిన. 107
ఉ. ఖేదముక్రోధమున్మదినిఁగీల్కొనబాహుబలాఢ్యులైనక్ర
వ్యాదులఁగొందఱన్గనియుమాంగనకేళిశిరోగృహాంతరం
బాదిగనంతటంగలయనారసియిక్కొఱగామిదున్మదో
న్మాదతఁజేసినట్టిఖలునాకసకుంగొనిరండుతీవ్రతన్. 108
క. అనిపలికినరోషానిల, జనితస్ఫుటవిస్ఫులింగచయభాతినిలో
చనరక్తదీప్తులడరఁగ, దనుజులువడిసేగుదెంచితత్క్రోధమునన్. 109
మ. అమలేందూపలవేదికాస్థలమునందాసీనుఁడైయయ్యుషా
రమణీరత్నముతోడనత్యునిపుణారంభంబునంద్యూతసం
భ్రమకేళీరతినున్నపంచశరసామ్రాజ్యాధిపత్యప్రసి
ద్ధమనోజ్ఞప్రతిభాసమృద్ధుననిరుద్ధుంగాంచిక్రోధాత్ములై. 110
మ. భయదాహంకృతిఁజక్రముద్గరగదాప్రాసాదిహేతిచ్ఛటో
దయరుగ్జాలదగద్ధగల్చిగుడనాదైత్యుల్విజృంభింపని
ర్భయుఁడైయాగ్రహవృత్తినుగ్రపరిఘప్రాంచద్భుజాదండుఁడై
లయకాలాంతకుభంగివారలపయిన్లంఘించివిఘట్టించుచున్. 111
చ. తలలుపగిల్చికంఠములుదగ్రతఁద్రుంచిభుజప్రదేశముల్
నలినలిగాఁగమోదినిటలంబులువ్రక్కలుసేసిదంతముల్
డులిచియురస్థలుల్పదిపిడొక్కలుచించిభయంకరాకృతిన్
సలిపెరణంబురక్కసులుచచ్చియునొచ్చియువిచ్చిపాఱఁగన్. 112

క. హతశేషులుభయవిహ్వల, మతులై యేతెంచి కదనమార్గముఁ దెలుపన్
వితతంబుగ నాజ్యాహుతి, నతిశయ జాజ్వల్యమానమగు వహ్నిక్రియన్. 113

వ. బాణుండత్యుగ్రరౌద్రముద్రాసమున్నిద్రనేత్రశోణుండును, సాహసాటోపధురీణుండునునై కదిసె నయ్యనిరుద్ధుండును, సమరసన్నద్ధుండును, భుజావష్టంభసమృద్ధుండునునై యతనితోడం దలపడియె నట్లయ్యిరువురును గంఠీరవంబులచందంబు, బెబ్బులులతెఱంగున, మత్తమాతంగంబులకైవడి, శరభంబులవిధంబున, గండభేరుండంబుల చాడ్పున, రోషావేశంబులు రెట్టింప, జయకాంక్షలు ముప్పిరిగొన, తర్జనభర్జనంబుల గర్జిల్లుచు, నన్యోన్యముష్టిఘాతంబులను, బరస్పరపాదపార్ష్ణిప్రహారంబులను, నితరేతరపక్ష్మభేదంబులను, బాహాబాహియుఁ గేశాకేశియుంగాఁ బెనంగ, నయ్యిరువురకున్ రణంబు దారుణంబై చెల్లుచుండె నప్పుడా ఋశ్యకేతు నుద్దేశించి యశరీరవాణి యిట్లనియె. 114

క. యదువంశతిలక వీనికి, నిది జయకాలంబు పెనఁగ నేటికి హరిచే
నొదవు నపజయము వీనికిఁ, గదియు శుభము నీకు నచిరకాలమునందున్. 115

గీ. అనియె నమ్మాట వీనులయందుఁ దగిలి, రిపుమహీరుహవిదళనోద్వృత్తిఁ గెరలు
యదుకులాగ్రణి యుగ్రమహోదగ్రకరిని, నిష్ఠురాంకుశభూతమై నిలువరించె. 116

వ. అప్పుడు. 117

ఉ. బాహుబలోద్ధతిం బ్రళయభైరవుభంగిఁ బరాక్రమించి యా
వ్యాహతలీల వానిఁ బెగడందఁగఁ జేసియుఁ గార్యమెంచి దే
వాహితుచేతఁ బట్టువడె నాహనుమంతుఁడు శక్రజిత్తుచే
నాహవభూమిఁ బట్టువడినట్లు ప్రశాంతనిజోగ్రకోపుఁడై. 118

క. వనితాసంపర్కంబున, ననిరుద్ధు నిరుద్ధుఁ జేసె నరివర్గంబున్
వనితాసంపర్కంబున, ననిరుద్ధు నిరుద్ధుఁ జేయు నరివర్గంబున్. 119

వ. ఇవ్విధంబున. 120

గీ. పట్టుకొని యాఁపు సేయించె బాణుఁ డతని, నప్పుడు తద్భంగజనితఖేదాంధకార
భిన్నహృదయారవిందయై కేవలంబు, నయ్యుషాంగన సంతాపమందుచుండె. 121

సీ. వేకువఁ గాంతిదప్పిన చంద్రబింబంబు విధమున నెమ్మోము వెల్లఁబోయెఁ
బగలింటి సెగలచే సొగటొందు పూఁదీఁగె వడువున నెమ్మేను వాడు చెందె
మునిమాపు జిగిఁ దొలంగిన తమ్మితేఁకులరీతిఁ గన్నుల దైన్యరేఖఁ దోఁచెఁ
దగు రేయి హిమమంటు తాంబూలదళముల చెలువున చెక్కిళ్లు చెమటదోఁగెఁ

తే. జిన్నఁబోవుచుఁ జెక్కిటఁ జేయిఁ జేర్చి, యాటపాటలపై వేడ్కలన్ని మఱచి
విరహసంతాపఖేదన వేఁగుచుండె, నేమి చెప్పుదు నయ్యుషాకోమలాంగి. 122

గీ. వీడుముఖకాంతిపసివాఁడువాడుమేను, నెండుకెమ్మోవిబాష్పముల్నిండుకన్ను
లామనోవ్యథఁగనుఁగొన్నరామరామ, జగతిఁబగవారికైననుజాలిగాదె. 123

వ. ఇట్లుమనోహరాంగి విరహానలసంతప్తమానహృదయురాలైయుండె నంతనిక్కడ. 124

మ. అనిరుద్ధుండుపురంబులోపలనులేఁడాశ్చర్యమేమొకదా
యనుకొంచున్నసుదేవముఖ్యులువిచారాక్రాంతచేతస్కులై
యనుమానించుచుభృత్యకోటులనుశోధ్యస్థానముల్చూడఁబం
చినవారెందును గానమంచుమరలంజేరంగనిర్వ్యత్తులై. 125

ఉ. తల్లియుఁదండ్రియున్బహువిధంబులఖేదమునొందుచుండఁగాఁ
బల్లవకోమలాంగియగుభార్యవియోగముచేఁగృశింపఁగా
నెల్లప్రజల్తదీయవ్యథలెంచివిచారమునొందుగోపికా
వల్లభుఁడంతయున్హృదయవారిజమందునెఱింగియుండియున్. 126

క. కానున్నకార్యమయ్యెడు, నేనిప్పుడువీరితోడనిజముగఁదెలుపం
గానేలయనుచుమాయా, మానుషవేషుండుకార్యమతిచేసుండెన్. 127

వ. అని శుకుండు పలికెననిన నటమీఁదటికథావృత్తాంతంబెఱింగింపు మనుటయు. 128

ఉ అంచభవప్రకాండగమనాదరపండితపుండరీకమా
ర్తండదిశేభతుండభుజదండధృతాంబుజజాండభాండర
జ్మండలమూర్తికుండలిపమండనచండతరైకకాండమా
ర్కాండరమేశరత్నమయకుండలమండితగండమండలా. 120

క. శ్రితరాజహంసయోగా, యతిదివ్యవిలోక నాకయోగమహితగా
శ్రితరాజహంసయోగా, యతదివ్యవిలోక నాకయోగమహితగా. 13)

స్రగ్ధర. ప్రతాపవద్రిపుద్రుమప్రభంజనప్రభంజనా
క్రతుక్రియాచరిష్ణుమానిరంజనానిరంజనా
యతిస్థిరత్రిలోకభోగదాకరాగదాకరా
ప్రతిష్ఠితాంబుధిభ్రమద్ధరాధరాధరాధరా. 131

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరా
యనమంత్రితనూభవ సుజనహితకృత్య నిత్యోబ్బయామాత్య ప్రణీతంబైన యనిరు
ద్ధచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# అనిరుద్ధచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---



మత్పాదాంబుజజని
తామరకల్లోలినీపయఃపూతనభో
భూమండలపాతాళమ
హామహిమోదారమంగళాద్రివిహారా. 1

గీ. అవధరింపుముశౌనకముఁడాదియైనఁ, మునివరేణ్యులతోడ నిట్లనియెసూతుఁ
డాపరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచివిజ్ఞాననిధియైనశుకుఁడుపలికె. 2

వ. ఇవ్విధంబున మాసచతుష్టయంబుగడచె నంత నొక్కనాఁడు. 3

సీ. యాదవవృష్ణిభోజాంధకాన్వయవీరకోటులిర్వంకలఁగొలువుసేయ
శంబరాహితసాంబచారుదేష్ణాదికుమారవర్గంబు నెమ్మదివసింపఁ
గవివందిమాగధగాయకవ్రాతముల్వితతవాక్ప్రౌఢిసన్నుతులు నెఱప
హితబంధుజనపురోహితమంత్రినికరంబు కాలోచితప్రసంగములునడప
తే. స్వామిసాహోపరాకు హెచ్చరికయనుచు, వేత్రహస్తులుపలుమారువిన్నవింప
మహితరత్నవిభాసభామంటపమున, నెమ్మిఁగొలువుండెనపుడులక్ష్మీశ్వరుండు. 4

సీ. చిఱునవ్వుటమృతంబు చిలుకుచెక్కిళ్లపైనక్రకుండలకాంతియాక్రమింప
ధవళారవిందసుందరమైనకన్నులనుల్లాసరసమురంజిల్లుచుండఁ
గౌస్తుభమాణిక్యకలితవక్షంబునవైజయంతీవైభవంబు మెఱయ
జిగిబిగిసొగసుచేఁజెలువొందు నెమ్మేనఁజర్చితచందనచ్ఛాయదనరఁ
తే చిత్రసింహాసనముననాసీనుఁడైయు, ప్రాంతపీఠికనుంచినయడుగుఁదమ్మి
నతనృపాలశిఖామణిద్యుతుల మెఱఁగ, భువనమోహనశృంగారపూర్ణుఁడగుచు. 5

వ. ఉన్నసమయంబున. 6

సీ. హంసపీఠికయందు ననువొందునల్లకీతంత్రులుపల్లికాతతులుగాఁగ
సుందరముఖపద్మమందస్మితచ్ఛవిసొంపారుపువ్వులగుంపుగాఁగ

రాజిల్లుతులసీపయోజాక్షమాలికల్ఫలశలాటులతోడి గెలలుగాఁగ
హరినామసంకీర్తనాలాపనినదంబు శుకశారికాపికస్ఫూర్తి గాఁగ
భసితలిప్తాంగరుచిసితప్రభలు నిగుడ, గహ్వరీభాగవిహరణగతివిలాస
జంగమాకారకల్పభూజంబు భాతి, నాకమున నుండి విచ్చేసె నారదుండు. 7

చ. నయనయుగంబునందుఁ గరుణారసవృష్టి చెలంగ భూషణో
దయరుచి చంచలాలతవిధంబునఁ బెంపు రహింప సాధుసం
చయముఖచాతకంబులకు సౌఖ్య మొసంగ సభానభస్థలిన్
నయగుణశోభిరమై వెలయు నందతనూభవనీలమేఘమున్. 8

గీ. కాంచియానందహృదయుఁడై కదియవచ్చి, సంయమీంద్రునిఁ గని లేచి సపరివారుఁ
డగుచుఁ బ్రణమిల్లి కనక సింహాసనస్థుఁ, జేసి యర్ఘ్యాదివిధులఁ బూజించునపుడు. 9

క. శ్రీరస్తు కుశలమస్తుమ, నోరథసంసిద్ధిరస్తు నిత్య శ్రీమ
న్నారాయణభవతే యని, సారెకు దీవించి పలికె జలజాక్షునితోన్. 10

క. తలిదండ్రులన్నదమ్ములుఁ, గులసతులును బుత్త్రపౌత్త్రకోటియు నాప్తుల్
చెలులుం జుట్టములును భృ, త్యులుఁ బౌరులు సుఖులగుచు నున్నారుగదా. 11

వ. అనిన నమ్ముకుందుండు మందస్మితముఖారవిందుండగుచు శతానందనందనున కిట్లనియె.

గీ. కమలజాత్మజ మీయనుగ్రహమువలన, వర్తమానమునందు సర్వము శుభంబు
భావికాలంబునకును శుభంబు నిజము, తావకాగమనంబు నిదానమగుట. 13

చ. పరమమునీంద్ర మీచరణపద్మపవిత్రపరాగలేశమె
వ్వరిగృహసీమనుం బొరయు వారి పురాకృత పుణ్య మెట్టిదో
దురితములన్నియుం దొలఁగుఁ దోఁచె భాగ్యము లెల్లఁ జేకుఱున్
నిరుపమ మోక్షలక్ష్మియును నిక్కము గా లభియించు వారికిన్. 14

వ. అని మఱియుఁ దదీయమహిమానురూపంబు లగుమధురాలాపంబులు పలుకుచుండి
తదనంతరంబ, ప్రసంగవశంబున నిట్లనియె.

శా. అయ్యా మాయ నిరుద్ధుఁ డెందఱిగెనో యాకస్మికంబౌటచే
నయ్యెచోటులఁ జూడఁబంచితిమి గోరంతైన వార్తలే
దయ్యె న్వానిఁ దలంచి మామక జనం బత్యంత చింతామయం
బయ్యె ట్లున్నది సేయఁగావలయు కార్యం బానతీయన్దగున్. 16

మ. అని సంకృష్ణుని మోముఁ జూచి దరహాసాంచన్ముఖాంభోజుఁడై
మునినాథాగ్రణి పల్కె సర్వమునకున్మూలంబవై సాక్షివై
పెనుపన్మన్పఁగఁ గర్తవై పరుఁడవై పెంపొందియు న్నీవెఱుం
గని చందంబున నన్నుఁ గార్యమడుగంగా నెంతధన్యుండనో. 17

వ. నే నెఱింగినయర్థంబు విన్నవించెద నవధరింపుము. 18

సీ. శోణపురీశుండు బాణాసురుం డనాహతశౌర్యశాలి సహస్రబాహుఁ
డతనికూఁతురు రూపయౌవనభాగ్యలక్షణ కళావతియుషాకన్యయొసఁగు
నాయింతికలలోన ననిరుద్ధుఁ బొడ గాంచి మోహించి సంతాపమునఁ గృశింపఁ
జెలికత్తెయైతగు చిత్ర రేఖాంగనయాత్మీయయోగవిద్యానిరూఢి
తే. నింగి నే తెంచి శయ్యపై నిదురవోవు, వానిఁగొనిపోయి యాచంద్రవదనఁగూర్చ
నతఁడుఁ దత్కాలికించితరతిసుఖాబ్ధి, మగ్నుఁడైయుండె నితరంబు మఱచియందు. 19

ఉ. అంతటఁ గర్భమయ్యె జలజాక్షికి నవ్విధ మెల్ల బాణుఁడా
చెంత మెలంగునంగనలచేవిని దైత్యులఁ బంపు వెట్టినం
బంతముతోడ వారదనుఁ బట్టఁగ వచ్చిన సింహశాబకం
బెంతయుఁ దీవ్రతన్మదగజేంద్రములన్ విదళించు కైవడిన్. 20

వ. హతశేషులు పోయి విన్నవించిన నతండు. 21

ఉ. చంపిన నాగ్రహంబున నిశాచరుఁ డార్చి యెదిర్చి పేర్చినం
దెంపును బెంపునుం గలిగి ధీకొని యుద్ధముఁ జేసి చేసి ని
ర్జింపఁగలేక దైవగతిచే ననిరుద్ధుఁడు వాని చేత బం
ధింపఁబడెన్ దశాస్యజఫణిప్రద రాస్తృత రాఘువాకృతిన్. 22

వ. జంబూద్వీపంబునం గల్గు విశేషంబులం జూచుటకై విశ్వంభరాభాగంబున సంచరించి శోణనగరప్రాంతమార్గంబున స్వర్గంబునకుం బోవుచుండి యీ యోగక్షేమంబు వినుటం జేసి తెలియఁబలుక న్వలసె నిటమీఁదటి కార్యంబు చతుర్థోపాయసాధ్యంబగుట మీచిత్తంబునఁ దోఁచియున్నదే కదా యథోచితప్రయత్నంబు సేయునది. మీకు నభ్యుదయపరంపరాభివృద్ధి యయ్యెడుఁ బోయివచ్చెదనని గోవిందునిచేత నామంత్రితుండై నారదుండు యథేచ్ఛావిహారంబున నరిగె నప్పుడు ప్రద్యుమ్నతనూభవ క్షేమవార్తాకర్ణనంబునం బొడము మోదంబును దదీయపరాజయవృత్తాంతశ్రవణసంజనితం బగు ఖేదంబును దత్పరిపంథి సంహరణోద్రేకం బగు రోషంబును ముప్పిరిగొని హృదయంబులం గలయనల్లి ముఖంబుల నాక్రమింప యాదవసమూహంబులు ముకుంద వదనారవిందంబవలోకించుచుండినవార లగుచుండి రప్పుడు పుండరీకాక్షుండు మంత్రిపుంగవుల నవలోకించి దండయాత్రకుఁ జతురంగబలంబు నాయితంబుగ మ్మని నియోగింపుఁడనిన వారునుద్దండ దండనాయకులఁ బడవాళ్లనుం బిలిపించి తత్ప్రకారంబుఁ దెలిపిన వారును దదీయ ప్రయత్నపరాయణులై యుండిరి. 23

క. భేరీధణంధణంధణ, భూరిధ్వానమున భూనభోభాగంబుల్
భోరుమని మ్రోసె నాశా, వారణములు బెదరె నదరె వసుధాధరముల్. 24

ఉ. పాపయుతత్రిషష్ఠముశుభస్థితకేంద్రముకార్యపూర్ణదృ
గ్వ్యాపకముం గదా యనిశరాసనలగ్నము చంద్రహోరను

ద్దీపితపుష్కరాంశగణుతించివిశేషముహూర్తమంచుమే
ధాపరిపూర్ణులైనసుధావిబుధుల్వినుతింపనయ్యెడన్. 25

సీ. అంతరాంతరనిబద్ధానూనఘంటికాఖండఘాణంఘణంఘణరవంబు
శుభగుణోజ్జ్వలసైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకతురంగభాసురంబు
ఘనపతాకాగ్రజాగ్రజ్జిహ్మగవిపక్షిపక్షరుగ్భూషితాంబరతలంబు
చక్రవిభ్రమణసంజనితనిర్ఘోషభగ్నదిశామతంగజకర్ణకుహర

తే. మహితలోచనదుర్నిరీక్షాక్షరాంశు, మాలికోగ్రసహస్రారమండితంబు
నైనరథమెక్కి పుండరీకాక్షుఁడపుడు, కదలెశతకోటిసూర్యప్రకాశుఁడగుచు. 26

శా. ఖేలత్తాళతరుధ్వజస్ఫురితమైక్రేంకారవత్కింకిణీ
మాలాజాలనిభాత్యుదాత్తగళశుంభద్ఘోటకోదగ్రమై
శ్రీలంబొల్చురథాంగమెక్కియరిగెన్సీరాయుధుండుల్లస
త్కైలాసాచలసన్నిభప్రభలెసంగన్సంగరోద్యోగియై. 27

చ నిరుపమపద్మరాగమణినిర్మితభూషణసంప్రయుక్తసుం
దరతరనీలవిగ్రహఘనద్యుతిపుంజముసేంద్రచాపవి
స్ఫురితపయోధరంబుగతిఁజూడ్కులకింపొనరింపమన్మథుం
డరిగెసమీనకేతనసమగ్రరథాంగపరాధిరూఢుఁడై. 58

క. కృతవర్మఁడుదేహాలం, కృతవర్మఁడుశిఖగకరపరిస్ఫుటసంధీ
కృతధర్మఁడుభీకరధి, కృతధర్మఁడునగుచునరిగెఁగృష్ణునిమ్రోలన్. 29

ఉ. సాత్యకిచారుదేష్ణగదసాంబముఖుల్యదువీరులేగిరా
ద్ధత్యమునంగురంగమమతంగజతుంగరథాంగసంస్థులై
హేత్యురుదీధితిచ్ఛటలుహేళివిలాసమునాక్రమింపలా
లిత్యసితాతపత్రతరళీకృతచామరాజమానులై. 30

సీ. చటులశుండాదండసంభూతపూత్కారపవనాహతినిమేఘపఙ్క్తిచెదర
రమణీయదంతనిర్మలచాకచక్యకాంతులుపట్టపగలువెన్నెలలుగాయ
నైపాదఘీంకారఘోషార్భటినిఖేచరాంగనల్పతులఁగవుంగిలింపఁ
జరదగ్రవిగ్రహస్ఫురణవజ్రికిఁబునర్జనితపక్షాహార్యశంకవొడమ

తే. ఘంటికాకింకిణీమాలికాసమూహ, ఘణఘణంఘణకిణికిణికిణినినాద
తాళపైలంబయానావధానములను, గంధబంధురసింధురఘటలునరిగె. 41

సీ. లేళ్ళభంగినిజౌకళించిచౌపుటములొక్కమ్మడిపదినైదునటికియటికి
పాత్రరకత్రైపలెనిల్చియడుగులోనడుగుగానాట్యంబులాడియాడి
కమ్మరసారెలకొలఁదిగిఱ్ఱునరెండుదిక్కులవలయముల్దిరిగితిరిగి
యనిలంబురీతిఁజివ్వనఁదూఁగిధరణిపైఁబదములునిలుపకపఱచిపఱచి

తే. కఠినరింఖాముఖోర్ధ్వహల్లుఠితభూప, రాగధూసరితామలరమ్యచికుర
సంచరవిధూతఖచరచేలాంచలంబు, లగుచుఁగిహికిహికార్భటినరిగెహరులు. 32

భుజంగప్రయాతము.

భ్రమచ్చక్రనిర్ఘాతబాహుళ్యధాటిన్, క్షమామండలంబెల్ల సంక్షోభమందన్
సముత్తుంగరంగద్ధ్వజచ్ఛన్నశుంభ, త్తమోభిత్పథంబుల్ రథంబుల్గమించెన్. 33

శా. చిల్లాడంబులమీఁదటన్బిగువుకాసెల్జుట్టిపొంకంబువా
టిల్లన్వ్రంకులుచెక్కుశూలములునీఁటెల్కత్తులుంగేళముల్
బల్లెంబుల్మొదలైనసాధనతతుల్బాహాబలోద్వృత్తిసం
ధిల్లందాల్చిపదాతికోటినడిచెన్దిక్చక్రమల్లాడఁగన్. 34

చ. గొడుగులుఫేనముల్తురగకుంజరముల్తిమినక్రసంచయం
బుడుగనివాద్యఘోషముమహోర్మిరవంబుపరిభ్రమింపఁగాఁ
బడుపటుహస్తభాస్వదరిపట్టికలుసుళ్లనుగాఁగ నెక్కుడున్
వడిశరచాపముల్గలిగివాహినివాహినిలీలనేగఁగన్. 35

గీ. క్షేమకారిదీర్చెచెలరేఁగియనుకూల, మారుతంబువీచెమాంసఖండ
ములనుబూర్ణకుంభములుపుష్పఫలములు, నెదురుపడియెసురగహేషలెసఁగె. 36

వ. మఱియుఁ గళ్యాణకరంబులైనశకునంబు లెడనెడం బొడగనుచు నచుచు ముదంబున భూసురసమూహంబు లుచ్చైస్స్వనంబున నాశీర్వదించి దిగ్విజయోస్తుతిధ్వాస్తు వచన బాహుళ్య నినాదంబులును,బసిండిపళ్లెరంబులఁగర్పూరదీపికా సముదయంబు నించి నీరాజనంబు లొసఁగుచు బ్రాహ్మణ పుణ్య వనితాజనంబులు జయమంగళంబని పాడు మంగళకౌశిక రాగస్వరంబులును,సౌధశిఖరంబులందుండిచూచుచుఁ గుసుమలాజాక్షతవితానంబుపైఁ జల్లు పురంధ్రీనికర కరకంకణకాంచనకాచ ఘణఘణత్కార నాదంబు లిరుపార్శ్వంబులనిలిచిహృద్యగద్యపద్యంబుల బాహాటంబునం బొగడువంది మాగధసందోహంబులజయవిజయీభవశబ్దంబులును, విపంచీస్వరమండలరావణహస్తాదియంత్రవాద్యంబులు మీటుచు సంగీతంబులుసేయు నాయకోత్తముల షడ్జ మధ్యమగ్రామరవంబులును, భేరీమృదంగ పణవానక డిండిమ ప్రముఖవాద్య ధణధణత్కార రావంబులును, శంఖకాహళ వేణుప్రభృతితూర్య నిస్వనంబులును సమదవారణఘీంకారఘోషంబులును, తురంగహేషానినదంబులును, శతాంగచక్రనిర్ఘోషంబులును, బథికనికరశరాసనపుఁజసింజినీ టంకారవిరావంబులును నేకీభవించి బ్రహ్మాండభాండమధ్యంబునం బూర్ణీభవించి మహాకోలాహలంబై రాకానిశాకర బింబోదయ సందర్శనసముత్సాహసముజ్జృంభమాణ మహాంభోనిధిననుకరింప ద్వాదశాక్షోహిణీబలసమేతుండై కతిపయప్రయాణంబుల శోణపురభేదనోపాంత ప్రదేశంబుఁజేరి యనర్ఘకిరణవ్యాప్తచ్ఛాయాసాంద్ర సకలమహీరుహశోభితంబును, మధురజల సంపూర్ణప్ర

వాహ తటాకవాపీ సమూహభూయిష్ఠంబునునైన మనోహరస్థలంబునఁ బటకుటీరం
బు లెత్తించి యచ్చట వేలాలంఘనంబుచేసి రాసమయంబున. 37

క. బాణాసురగర్వముసం, క్షీణంబగునింకననుచుఁ జెప్పిన క్రియఁగీ
ర్వాణులుసంతసమందఁగ, క్షోణిఁజదత్కేతనంబుగూలెం బెలుచన్. 38

వ. అప్పు డమ్మురాంతకుండు తత్పురంబు దాడివెట్టంబంచిన. 39

సీ. ప్రాకారములుద్రవ్వి పడఁద్రోయువారును గోపురంబులు నేలఁగూల్చువారు
సౌధయూథము నేలచదునుచేసెడివారు వనభూజములు పీకివైచువారు
కమలాకరములు భగ్నము సేయువారును ధనవస్తువులఁ గొల్లఁగొనెడివారు
యజ్ఞశాలలు వహ్నికర్పించువారును దెగి పౌరజనుల బాధించువారు
తే. నగుచు యాదవవృష్ణిభోజాంధకాది, యోధవీరులసైన్యంబులుక్కుమిగిలి
తత్పురంబాక్రమించి యుద్దండవృత్తి, దాడివెట్టుట కబ్బాణదైత్యవిభుఁడు. 40

మ. నటదుద్యద్భ్రుకుటీభయంకరముఖాంతశ్శోణదృక్కోణవి
స్ఫుటదీప్తిచ్ఛటవిస్ఫులింగపటలోద్భూతంబు గావింపను
త్కటధాటీపటుతాకహాకహకహధ్వానాట్టహాసార్భటిం
జటులాహంకృతివిస్తరిల్లసమరోత్సంక్రీడనోత్సాహియై. 41

మ. రణభేరీప్రకటాంకభాంకరణసంరావంబు త్రైలోక్యభీ
షణమై మ్రోయ భుజాసహస్రసముదంచచ్ఛాతహేతిచ్ఛటా
ఘృణిశోభిల్లనవర్ఘ్యరత్నఖచితప్రేంకచ్ఛతాంగాధిరో
హణుఁడై సంగరకేళికిన్వెడలెనుద్యద్వాహినీయుక్తుఁడై. 42

గీ. వాని మొగసాలఁ గాఁపున్నవాఁడు గాన, యుద్ధసాహాయ్యమునకునుద్యుక్తుఁడయ్యె
భక్తసులభుండు శాంకరీప్రాణనాథుఁ, డనుఁగుఁజెలికానితోఁ గొంత పెనఁగుటకును.

వ. అప్పుడు. 44

సీ. ఘనవాలవిక్షేపజనితవాతాహతిదిగ్వలయంబు దిర్దిరనుదిరుగ
వడిఘణిల్లున నంకెవైచిన మేరుమందరశైలములు ప్రతిధ్వనులనీన
గుప్పించి యుఱికినఁ గుంభినీభారంబుసైఁపక దిక్సామజములు మ్రొగ్గఁ
గ్రొవ్వాడికొమ్ములకొనల చిమ్ములబలాహకసమూహము వకావకలు గాఁగఁ
తే. గంఠవిలుఠన్మహోజ్జ్వలఘంటికాప్ర, భూతఘాణంఘణస్వనస్ఫురణ దనర
విజితరజతాచలస్ఫూర్తి వృషభమూర్తి, నీలకంఠుని ముందర నిలిచెనపుడు. 45

సీ. ఘనజటాజూటసంకలితగంగాతరంగచ్ఛటల్ గళగళంఘుళ యనంగఁ
జలితావతంసకోమలసళిస్రవసుధామాడంబు ఝుళఝుళంఝుళ యనంగఁ
నంగసంఛాదితవ్యాఘ్రేంద్రచర్మ సంచలనము ల్బెళి బెళ బెళ యనంగఁ
గలపరిభ్రమితభీకరశాతశూలనిర్మలదీప్తి తళతళతళ యనంగ

తే. శంకరుఁడు నంది పై నెక్కి హుంకరించి, యతిశయార్భటిఁ గెవ్వున నార్చి పేర్చి
చౌకళింపులు దుమికించి చక్రగతులఁ, దరిమి పేరంబు దోలుచు నరిగె ననికి. 46

క. చంచన్మౌక్తమలపింఛో, దంచితకేకేంద్రవాహనారూఢుండై
వేంచేసె భవుని వెంబడిఁ, గ్రౌంచవిభేదనుఁడు ప్రమథగణపరివృతుఁడై. 47

లయగ్రాహి.

తుండములు పూత్కరణచండపవనంబు ఘనమండలముఁ దాఁకి బహుఖండములు సేయన్
మెండుకొని ఘీంకృతులు దండిసరసీరుహభవాండఘటమధ్యమున నిండి కడు మ్రోయన్
గండముల పైమదమఖండఘణి తిం గురియుచుండఁ బటుదంతరుచిమండితముగా వే
దండములు తండములు భండనజయోద్ధతిని గొండలగతి న్నడిచెఁ బాండవకులేంద్రా. 48

స్రగ్ధర. రింఖాసంఘాతజాతాయతవితతధరారేణుపంకీకృతాబ్ధుల్
ప్రేంఖన్మాణిక్యమాలాధృతకళలుతదాభీలఘంటారవంబుల్
పుంఖీభూతాస్త్రిమార్వీస్ఫుటనికటధనుస్ఫూర్జితారోహకంబుల్
కంఖాణంబుల్విచిత్రక్రతుగమనచమత్కారలీలం గమించెన్. 49

తోటకవృత్తము.

పాటవబాహవభవ్యతనూభృ, చ్చాటుసురాలయశైలవిభాతిన్
హాటకరత్నమయస్ఫుటదీప్తుల్, దాటి చెలంగ రథవ్రజ మేగెన్. 50

మ. కృతనానావిధసాధనక్రమసమిత్క్రీడాచమత్కారని
ర్జితబేతాళులవక్రవిక్రమగుణశ్రీతుల్యకంఠీరవుల్
శతకోటిప్రతిమానవిగ్రహులు దంచద్ధైర్యజాంబూనద
క్షితిభృత్తుల్యభటసంఘముల్నడిచె నక్షీణప్రతాపోన్నతిన్. 51

గీ. ఇట్లు చతురంగసేనాసమేతుఁడగుచు, నరిగె నెడ నెడఁ బొడగాంచు నాపజయిక
శకునముల నాత్మలోపల సరకుగొనక, దురభిమానంబు పేర్మి నిర్జరవిరోధి. 52

వ. అప్పుడు. 53

మ. పరమేశుల్భగవంతులవ్యయులు శుంభద్బాహుశౌర్యోజ్జ్వలుల్
హరిమృత్యుంజయులిద్దఱు న్రణము సేయం జూచు నుత్కంఠచే
సరసీజాసనపాకశాసనసమస్తబ్రహ్మదేవర్షికి
న్నరసాధ్యాదులు మింట నిల్చిరి విమానవ్రాతసంరూఢులై. 54

వ. యాదవసైన్యంబును నిస్సామాన్యం బగు నుత్సాహంబున దానవ సేనాసమూహంబు
నెదుర్కొనియె నట్లయ్యుభయబలంబులును సంవర్తనసమయ సముజ్జృంభమాణా
న్యోన్య సంఘట్టనపూర్వాపర మహార్ణవంబులవిధంబున నొండొంటిం దాఁకి రథికులు
రథికులును, వారణారోహకులు వారణారోహకులును, నాశ్వికులు నాశ్వికులును, బదా
తులుఁ బదాతులును, ద్వంద్వయుద్ధంబున నసంగడంగి కోదండ దండంబుల నంకించి శింజి

నీటంకారనినాదంబులు రోదసీకుహరంబు నిండ నాకర్షణసంధాన దృఢముష్టిలాఘవ లక్ష్యశుద్ధిదూరాపాతవిశేషంబులం బ్రచండంబులయిన కాండ ప్రకాండంబులు సంప్రయోగించి. రథరథ్యకేతుసూతవ్రాతంబుల మర్మఘాతంబున నొప్పించుచు, మృత్యుజిహ్వాకరాళంబు లగుకరవాలంబులు సౌదామనీలతావితానంబులపోలికం దళత్త్రాయమానంబులై చూపులకు మిఱుమిట్లుగొలుప ఝుళిపించి దేహంబులు పక్షీంచి తునుకలై పడ నఱకుచు నవక్రవిక్రమంబునం జక్రంబులు గిరగిరం ద్రిప్పివైచి ఛత్రచామర ధ్వజదండంబులు ఖండంబులు సేయుచుఁ, బ్రజ్వలజ్జ్వలన కీలాజాలంబుల లీలం గ్రాలుశూలంబుల నాభీలంబులగు శతాంగమాతంగతురంగాంగంబులు భగ్నంబులుగాఁ గ్రుమ్ముచుఁ, గఠోరంబులగు కుఠారంబులెత్తి కంఠీరవంబుల క్రేవనకుంఠ కంఠారవంబులు చెలంగ నురశ్శిరకరచరణప్రముఖాంగంబులకొఱకు నఱకు దారుశకలంబుగతి వికలంబులు సేయుచు, బల్లంబుల మొల్లంబులగు నుల్లాసంబులం గ్రేళ్లురుకుచు, బల్లెంబులు బుమ్ముకొని ఘల్లునం బెల్లార్చి గాయంబుల నమేయంబులై కీలాలప్రవాహంబులు దొఱంగం బొడిచి పడఁజిమ్ముచు, మదోద్రేకంబున గదాదండంబులు విసవిసం ద్రిప్పి గాత్రంబులు నుగ్గునూచంబులుగాఁ గొట్టుచు. శ్వసనాశనసంకాశంబు లగు పాశంబులు వీరావేశంబులం గండదేశంబులం దగులం బ్రయోగించి ప్రాణంబులు క్షీణంబులుగాఁ బడనీడ్చుచు, మఱియుఁ బ్రాసపట్టిస ముసలముద్గర తోమరభిండివాల శక్తి క్షురికాది నానావిధాయుధంబులం గొట్టివేసి నఱికి చీరించి చెండాడి గగ్గోలుపఱిచినం జంభవిద్వేషికరాంభోజశుంభద్దంభోళిధారాహతంబులైన విశ్వంభరాధరంబుల చందంబునం గూలి పీనుంగులైన యేనుంగులును బుడమిం బడి తన్నుకొనుచుఁ గంఠగతప్రాణంబులైన కంఖాణంబులును యుగయుగ్యచక్రకూబర సహితంబుగా హతాంగంబులైన శతాంగంబులును గూలిన కేతనంబులును, జిత్రరూపంబుల విధంబున విగత విక్రమార్భటులైన భటులును, సోలిన రాహుత్తులును, రాలిన భూషణమణిగణంబులును, వ్రాలిన ఛత్రచామరంబులును, వికలంబులైన దంతంబులును, శకలంబులైన కుంభస్థలంబులును, ప్రక్కలైన డొక్కలును, జెక్కులైన ప్రక్కలును, భిన్నంబులైన కపాలంబులును, ఛిన్నంబులైన కపోలంబులును, విఱిగిన చరణంబులును, జిరిగిన చర్మంబులును, శీర్ణంబులైన కర్ణంబులును, జూర్ణంబులైన వర్మంబులును, గలిగి మహాబిలంబునం గోటానకోటులును, దట్టంబులై యట్టలాడం జొచ్చె. గజివాజికళేబరంబులు జీమూతంబులును, సాంద్రచంద్రహాస ధగద్ధగితద్యుతులు శంపాలతలును, శంఖదుందుభిస్వనంబులు మేఘనిర్ఘోషంబులును, గదాముసలముద్గరఘాతంబు లశనిపాతంబులును, విశీర్ణభూషణపద్మరాగ గారుత్మత ఘృణిరేఖ లింద్రధనువులును, విభిన్నకుంభికుంభచ్యుత ముక్తాఫలంబులు వర్షోపలంబులును, గాకగృధ్ర ప్రభృతివిహంగంబులు చాతకంబులును, శోణితపూరంబు జలాసారంబునునై, యోధయోధ ధనుర్విముక్తంబులై గగనదేశంబు నిరవకాశంబుగా నిండి కల్పితాంధకారనైల్యం

మైన బాణబాహుళ్యంబువలన మార్తాండమండల గోచరలక్షణంబులేమిదుర్దినంబై యుత్కృష్టవర్షాగమంబు ననుకరించియుండెనప్పుడు వేతాళ ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ ప్రముఖభూతంబు లుత్సాహసమేతంబులై మాంసఖండంబులు కడుపులనిండమెక్కి రక్తపానంబుచేసిన గఱ్ఱునం ద్రేపుచు, శ్వేతతురంగ చర్మంబులు ధవళాంశుకంబులుగా ధరియించుకొనుచు, మేదఃపంకంబు రక్తజలంబులం బదనుచేసి లేపనంబులుగాఁ దనువుల నలందికొనుచుఁ దునకలై పడిన యాతపత్రంబులఁ బువ్వులుగా నలంకరించుకొనుచు, గజకళేబరంబులఁ బర్యంకంబులుగాఁ బవ్వళించుచు, ఘోటకాండంబులు క్రముకఖండంబులును గుంజరకర్ణంబులును తాంబూలపర్ణంబులును, ఏసలుచూర్ణంబులునుంగాఁగలయ నమలి విడియంబులు చేసి జిహ్వావలోకనంబులు చేసికొనుచుఁ గామినీభూతంబులతోడి సురతక్రీడావిలాసంబులం జొక్కుచు, గంధర్వపిశాచంబులు సేయు గార్దభస్వర సంగీతంబులకు నానందంబునొంది కరితురగనరమాంసంబులఁ త్యాగంబులిచ్చుచో వారల గానంబులకుఁ దాముం దమవదాన్యతాసౌందర్యవిశేషంబులకు వారును శిరఃకంపంబులు చేసి మెచ్చుకొనుచు, నివ్విధంబున వివిధభోగంబులందనిసి యుభయబలంబులం బొగడుకొనుచుం దాండవంబులు సలుపు నమ్మహాకోలాహలంబువలన సంగరప్రకారంబు ఘోరంబైవర్తిల్లెనందు. 55

చ. హరిహరులిద్దఱుంగదిసియాహవకేళియొనర్చిరుద్ధతిన్
సురనికరంబులబ్రపడిచూడఁగశార్ఙ్గపినాకచాపముల్
కములఁబూనియొండొరులకంఠభుజోరులలాటమర్మముల్
గురుతరచండకాండములఁగ్రుచ్చుచురోషమహోగ్రమూర్తులై. 56

మ. హరుఁ డాకర్ణధనుర్గుణుండగుచుబాహావిక్రమక్రీడని
ష్ఠురనారాచపరంపరల్వఱపినన్సొంపారునెమ్మోమునన్
దరహాసద్యుతివింతయైనిగుడఁబద్మామానినీజానిభీ
కరబాణంబులవానినన్నిటివెసన్ఖండించె నొక్కుమ్మడిన్. 57

క. భగవంతుండగుశంభుఁడు, గగనదిశాపూరితముగఁగడుఁదీవ్రతతో
నగణితవిశిఖౌఘంబులు, నిగిడించిమహోగ్రతమమునిండఁగఁజేసెన్, 58

మ. గరుడాంకుండరుణాంతనేత్రుఁడగుచున్జ్వాలాగ్నిసంకాశభీ
కరకాండాళిఁదదంధకారమడఁగంగాఁజేసెనాతీవ్రతం
బరివేషస్థితినుండెవిల్లురవిబింబస్ఫూర్తినొప్పెన్ముఖాం
బురుహంబుగ్రమయూఖలీలఁదనరెన్పుంఖానుపుంఖాస్త్రముల్. 59

చ. మఱియుననేకబాణములుమర్మములంటఁగ నేసెహుంకృతుల్
ఫాలతలలాటలోచనుఁడునిష్ఠురశాతశిలీముఖావళుల్

కలకటిసేసె సేసినను గంజదళాక్షుఁడు దానినన్నిటిన్
నలకినిశాతకాండములనాటఁగ సేసెఁ దదీయదేహమున్. 60

శా. ఆసంరంభముఁ జూచి సైఁపక హరుం డాగ్నేయబాణంబుఁ బ్ర
జ్ఞాసామర్థ్యముతోడ సేసిన ఘనజ్వాలాన్వితంబై పయిన్
రాసత్యారమణుండు వారుణమహాస్త్రంబుం బ్రయోగించి సాం
ద్రాసారంబగు వారిపూరమున మాయం జేసె నత్యుద్ధతిన్. 61

ఉ. శర్వుఁడ ఖర్వగర్వమున శౌరిపయిన్ మరుదంబకంబు గం
ధర్వసుపర్వపన్నగవితానము లద్భుతమంద సేసినన్
సర్వమయుండు చక్రియది సంహరణంబొనరించె నుజ్జ్వల
త్పర్వతసాయకంబున విపక్షబలంబులు దల్లడిల్లఁగన్. 62

శా. ఆటోపంబున శంకరుం డపుడు బ్రహ్మాస్త్రంబు సంధించి మౌ
ర్వీటంకారమెసంగ నంబుధియు ఘూర్ణిల్లంగ సేయన్ని రా
ఘాటంబై చనుదేరఁ గన్గొని తదుగ్రస్ఫూర్తి వారించె దో
ష్పాటధ్వంసితదంబకంబున నవాస్త్రశ్రేణి కీర్తింపఁగన్. 63

శా. అత్యుగ్రాకృతి యైన పాశుపతదివ్యాస్త్రంబు భూతేశుఁ డౌ
ద్ధత్యంబొప్పఁగ సేసె నప్పుడు మహోద్యద్విక్రమస్ఫూర్తి నా
న్నత్యంబై యసమానమై వెలుఁగు శ్రీనారాయణాస్త్రంబు సం
స్తుత్యప్రాభవశాలి కృష్ణుఁడు సమంత్రోక్తిం బ్రయోగించినన్. 64

మహాస్రగ్ధర. రాలెన్నక్షత్రపఙ్క్తుల్ రహిచెడియె నహోరాత్రరాణ్మండలంబుల్
వ్రీలెన్ దిక్కుడ్యసంధుల్ వ్రీఁగిపడియె నుర్వీధ్రశృంగంబు లోలిం
దూలెన్ మేఘౌఘ మత్యద్భుతజనపవనోద్ధూతధూళీసమంబై
కూలెన్ వృక్షాళి వ్రొగ్గెన్ వలయభరభృత్కుంభికుంభీనసంబుల్. 65

క. ఖండేందుధరజనార్దన, కాండము లొండొంటిఁ దాఁకి గగనంబున ను
ద్దండగతిఁ బోరి పోరి ప్ర, చండత హరిశరము హరుని శరముం దోలెన్. 66

తే. తనదు దివ్యశరంబులు దైత్యదమను, చే నిరర్థకమగుటయు మానసమున
నూహ దక్కి రణోత్సాహ ముజ్జగించి, యుండెఁ గళ్యాణశైలకోదండుఁ డపుడు. 67

మ. జలజాతాక్షుఁ డపక్రవిక్రమమునన్ సమ్మోహనాస్త్రంబు భూ
తలసంక్షోభముగాఁగ సేయుటయు నిద్రాపారవశ్యంబుతో
వలనొప్పన్ వృషభేంద్రుమూఁపురముపై వ్రాలెన్ హరుం డొయ్యనన్
గలధౌతాచలశృంగసంగతశరత్కాలాంబువాహాకృతిన్. 68

వ. రుక్మిణీశ్వరుండును గుమాగుండును నుద్దండపుండరీకంబులవిధంబున గడంగి కోదం
డపాండిత్యంబు భువనస్తుత్యంబుగా ఖండనంబు సేయుచు. 69

మ. శరజన్ముండు ప్రదీప్తరోషముఖుఁడై శాతాశుగశ్రేణినా
హరిజున్నొవ్వఁగ నేసి యార్చినమహోగ్రాకారుఁడై పేర్చి శం
బరవిద్వేషి శిలీముఖప్రకరసంపాతంబునన్ముంచి జ
ర్జరితాంగుండగునట్లు చేసె సురలాశ్చర్యంబు నంబొందఁగన్. 70

తే. నారిఁ దెగ నేసి యతని మయూరవాహ, నంబు నెమ్మేన నిశితబాణములు చొనిపి
చేతులాడక యుండంగఁ జిక్కుపఱుప, నిలువలేక విశాఖుండు తొలఁగిచనియె. 71

ఉ. చండతరప్రతాపభుజశౌర్యధురంధరుఁడై నకాముపా
లుండు హలంబు చే రణములో మడియించెను గూపకర్ణకుం
భాండుల భీమహుంకరణభగ్నపయోజభవాండభాండులన్
భండనభైరవస్ఫుటకృపాణసహోజ్జ్వలబాహుదండులన్. 72

గీ. సాంబుఁ డత్యుగ్రరౌద్రావలంబుఁ డగుచు, బాణనందను నధికదోర్బలు నిబలుని
గదిసి వివిధాస్త్రశస్త్రసంఘాతములను, భూచరులు ఖేచరులు మెచ్చఁ బోరి పోరి. 73

గీ. గుఱ్ఱములఁ జంపి కేతువుఁ గూల నేసి, రథము చెక్కలు సేసి సారథిని ద్రుంచి
ఘనతరాశుగపీడితాంగునిగఁ జేయ, నసురపతినందనుఁడు పలాయనము నొందె. 74

శా. శైనేయుండును బాణుఁడున్ రణజయోత్సాహంబులాస్యంబులన్
బూనం గార్ముకశింజినీభవరవంబుల్ దిక్కులన్నిండఁ దన
స్త్రానీకక్షతజాతరక్తజలపూరార్ద్రంబులైనట్టి నె
మ్మేనుల్ పుష్పితకింశుకంబులగతిన్ మీఱంగఁ బోరాడుచున్. 75

వ. ఉండి రట్లవాసుదేవుండు సమ్మోహనబాణపాతంబున భూతేశుఁ బరవశుఁ జేసి లబ్ధవిజ
యుండై నిరుపమోత్సాహంబున నిజవదననిర్గత నిరర్గళ నిష్ఠుర నినాదనిర్భిన్న నిఖిల
నిర్జరాహితసైన్యంబగు పాంచజన్యంబుఁ బూరించుచు విరోధివరూథినిపయిం గవిసి
కరాధిజ్య ధనుర్ముక్తశరాధిక్యఘాతంబుల నరిశిరోధినిచయంబులు నఱికి ధరాధీనంబు
సేయుచుఁ గరాళంబులగు కరవాలంబులఁ గరిహరిప్రకరవాలంబులు కీలాలంబులు పో
రాళంబులై తొరఁగ దునుముచు దృఢవంతంబులైన కుంతంబులఁ బంతంబున దంతం
బులు విఱుగం బొడిచి దంతావళంబుల ననంతంతవకృతాంతనిశాంతంబున కనుపుచు నస
దృశంబులగు ముసలంబుల కరబిసరుహంబుల విసవిసం ద్రిప్పి యసురవిసరంబులు పస
చెడి వసుమతిం గలయ నసువులం బాపుచుఁ గదల మెఱుంగులు చదలం బొదలం ద్రిప్పుచు
వలదని మదంబులం గదిసి యెదురుకొని పోదుపు పదాతులం గదల మెదలనియ్యక పదనం
బులు చదిసి రదనంబులు డుల్లి గుదులు గొనుచుం జావమోదుచు నంతకంతకు నతిశయం
బైనవీరావేశంబునం బ్రళయకాలరుద్రాకృతిం బేర్చి రక్తప్రవాహంబులును మాంసరా
సులును ద్రెవ్వుల ప్రోవులు నెముకల గుట్టలును నై రణంబతిదారుణంబుగఁ జిత్రక్రీడస
లుపుచుఁ బాంచజన్యజృంభన్నినాదంబులు భూనభోంతరంబులు నిండఁ బూరించు
చుండె నప్పుడు. 76

సీ. సారథుల్వడినశ్వములీడ్చుకొనిపోవ నందందపడిపోవునరదములును
దైన్యఘీంకారనాదములు సేయుచుఁ బటాపంచలై పాఱెడుభద్రకరులు
నేటులఁబడి మొదు రెక్కఁ జాలక వాహకులతో నపఱచెడిఘోటకములు
ననిమొన నిల్వ ధైర్యములు చాలక తలల్వీడంగఁ బరువెత్తు వీరభటులు
తే. నగుచుఁ గాళియదమన బాహాప్రచండ, కార్ముకజ్యాలతాముక్తకాండపటల
దహనకీలాకలాపసంతానమునకుఁ, దాళకపలాయనమునొందె దనుజబలము. 77

వ. అప్పుడు. 78

ఉ. విచ్చినయాత్మసేనఁ గని వీరుఁడు బాణుఁడు తెంపుచూపఱుల్
మెచ్చఁగఁ జేయివీచి మరలించి నదద్బల మెల్ల రోషముల్
హెచ్చఁగ నొక్కటన్మరలె నేపున సైన్యయుగంబు పోరికిం
జొచ్చినసంకులాహవము చూడ భయంకరమయ్యె నయ్యెడన్. 79
శా. బాణుండప్పుడు రోషరక్తముఖుఁడై బ్రహ్మాండభీమాకృతిన్
జాణూరాంతకు డాసి మామక భుజాంచద్ధాటిచే సంగర
క్షోణిం బన్నగసిద్ధకింపురుషరక్షోయక్షగంధర్వగీ
ర్వాణుల్ నిర్జితులైరి నాయెదుట నిల్వన్ నీవు శక్తుండవే. 80
చ. అనవుడు మందహాసముఖుఁడై హరి నీభుజశక్తి నీవె సె
ప్పనము నలజ్జ లేక పలుమాఱును మెచ్చుకొనంగ నీతియే
యని మొననిల్చినప్పుడు నిరర్థకమీ వెడమాటలేల నాఁ
కొని భుజియింపఁ బోవుచును గూరలమేలడుగంగ నేటికిన్. 81

మ. అనునాలోన సహస్తపంచశతకోద్యచ్చాపుఁడై నిల్చి త
క్కినయేనూఱు కరంబులన్ శరములుత్కృష్టప్రతాపంబునం
గొని బెట్టేయఁగ మండలీకృతమహాకోదండముక్తార్ధచం
ద్రనిశాతాంబకపఙ్క్తిఁ ద్రుంచె నవిరాధానాయకుండుద్ధతిన్. 82
సీ. శతములు వేలు లక్షలు కోటు లర్బుదంబుల శరౌఘంబులఁ బొదివి పొదివి
వాయువ్య గారుడ వారుణ ప్రముఖదివ్యేషుజాలంబుల నేసి యేసి
కరవాలశూలముద్గరశక్తితోమరప్రాసాయుధంబులఁ బఱపి పఱపి
శాంబరీమాయావిడంబనం బొనరించి శిలలు నెత్రుఁ గురియఁ జేసి చేసి
తే. యసురభర్త విజృంభించి యార్చుటయును, నడుమనన్నింటి ఖండించి పొడవడంచి
త్రుంచి మాయించి కడు విక్రమించి మించి, తన ప్రతాపంబు చూపె నద్దనుజవైరి. 83

వ. మఱియును. 84

ఉ. అత్తఱి నమ్మసందుఁడుఁ దదర్ధసహస్రశరాసనంబులన్
గత్తిమొగంపుటమ్ములను గండ్రలు సేయుచునుండ నంతలో

నెత్తెడువిండ్లునారిబిగువెత్తెడువిండ్లుశరప్రయోగసం
పత్తిఁజెలంగువిండ్లునటుబాణుకరంబులనొప్పెవింతయై. 85

చ. తొలుతటియమ్ముపంచశతదోర్ధనురావళిద్రుంచినొంచున
వ్వలఁజననింతలోమొదలిపైపునబాణుఁడుగ్రమ్మఅంగరం
బులఁగొనుచాపముల్ నఱికిపోవుమరెండవయమ్ముముందరన్
వెలుఁగుశరమ్ముగూడదివినిండెహరిప్రదరంబులీగతిన్. 86

శా. కోపాటోపవిజృంభణారుణితచక్షుష్కోణసంజాతవి
త్షోపాతంబులుమేనఁజొచ్చివెడలెన్నాఁబోలునన్నల్లత
చ్ఛాపోద్భూతశరౌఘముల్తనుసంచారంబులైపక్షమం
దాపూర్ణంబుగనాటివెల్వడుసురేంద్రారాతిదేహంబునన్. 87

చ. ధనువులుద్రుంచినూతుతలధారుణిమీఁదనలంకరించివా
హనములసంహరించిసముదంచితకాంచనకేతనప్రపా
తనమొనరించిమైరుధిరధారలుగ్రమ్మఁగ నొంచిమించియ
ద్దనుజవిరోధియొత్తెఁగృతదానవదైన్యముపాంచజన్యమున్. 88

క. మతిభ్రమసినట్లునిల్చె, స్థితుఁడైబెగడొందుబాణుజీవమురక్షిం
చుతలంపునముదిరక్కసి, యతనిజననికోటరీసమాహ్వయయంతన్. 89

ఉ. అంబరహీనమైనవికృతాకృతితోడుతనాభిక్రేవలన్
లంబకుచద్వయంబుగదలంబులుచెక్కులజుంజుఱౌశిరో
జంబులువ్రేలనమ్మదినిశాచరిఖేచరియైపిశాచరీ
తింబఱతెంచినిల్చెవసుదేవతనూభవుసమ్ముఖంబునన్. 90

శా దానింజూపఁగరోయుచున్విముఖుఁడై దైత్యాంతకుండున్ననా
లోనంబాణుఁడెడంబుగాంచిపఱచెన్లోకుల్ప్రమోదింపఁగా
మానంబెల్లనువీడియాత్మనగరీమార్గంబునన్భీతిదృ
క్కోనశపున్యతఁబాదఘట్టనలభూభాగంబుగంపింపఁగన్. 91

ఉ. ఆహరిముందటన్నిలిచినట్టినిశాటియుసేగెనంతస
మ్మోహనబాణపాతమునముంచినతాంద్రికముఁదొలంగికా
మాహితుఁడంపశాంభవమహాజ్వరమంఘ్రులుమస్తకంబులున్
బాహువులుంద్రిసంఖ్యలనుభాసిలఁగానతిఘోరమూర్తియై. 92

మ. తనమీఁదంజనుదేరవచ్చునుబద్ధానేకతీవ్రజ్వరం
బునుబంపన్భయదాకృతింగడిసియార్పుల్మింటనంటంగదాఁ
కిననారెంటికినయ్యెనాహవముసోత్కంఠప్రతాపోగ్రత
ర్జనసంభర్జనగర్జనంబులుజగత్సంక్షోభముంజేయఁగన్. 93

తే. ఘోరిఘోరిభుజాబలస్ఫురణదక్షి, శాంభవజ్వరమాత్మలోఁ సంచలించి
వైష్ణవజ్వరమధికజవంబుతోడ, వెంటనంటంగనార్తితో వెఱచిపఱచె. 94

ఉ. ఎక్కడఁజొచ్చినంజాణుగనియ్యకవైష్ణవివెంటనంటఁగా
దిక్కులనెల్లనుంగలయఁ ద్రిమ్మరియార్తిహరించికావవాఁ
డొక్కఁడులేమికిన్ వగలనొందుచుఁ గ్రమ్మఱఁ బాఱుదెంచిన
మ్యక్కఱణావిధేయుహరినార్తశరణ్యునిఁ జేరిభక్తితోన్ 95

శా. శ్రీలక్ష్మీపతయేకృతాఖిలజగత్క్షేమాయదివ్యాజసే
నీలాంభోధరకాంతికాంతవపుషేనిర్వాణసంధాయినే
లీలాకల్పితతాత్త్వికాయమహతేలేశాతిపూర్ణాత్మనే
నాళీకాసనపూజితాయభవతేనారాయణాయోన్నమః. 96

దండకము.

శ్రీమద్రమామానినీమానసారామవాటీవసంతాయమానాసమానాంగశృంగారభావా సమగ్రప్రభావా ప్రభావార్యమాణా యుతాహోధిరాణ్మండలా సేవితాఖండలా కుండలానర్ఘ్య రత్నచ్ఛవిచ్ఛన్నగండస్థలప్రస్ఫురన్మందహాసాకరాంభోజభృన్మందకాభోజ్జ్వలచ్చంద్రహాసా మహాసాహసక్రూర కంసాఘవత్సాదిదైతేయసంఘాతశైలాంబుభృద్వాహనాగోపకన్యామనోమోహనా గేహనారీసుతార్థాదిసంసారభోగాబ్ధినిర్మగ్నహృత్పాపికృతాళీ దురాపాదరా పాదకీర్తిప్రతాపోదయానీదయాశోభితాపాంగ వీక్షాసుధాలేశ సంసేవనా లబ్ధసౌభాగ్యులై బ్రహ్మరుద్రామరాధీశముఖ్యుల్ మహత్త్వంబునన్ బూష్ణులైయుందురేతజ్జగత్పాలనార్థంబుగానీవుమత్స్యస్థితింగచ్ఛ పాకారతన్ యజ్ఞవారాహలీలన్ నృసింహస్వభావంబునన్ వామనస్ఫూర్తితో జామదగ్న్యస్వరూపంబునన్ రామచంద్రావతారంబునన్ రౌహిణేయాభిధేయంబుతో బౌద్ధవేషంబుతోడంగలిక్యాకృతిన్ సాధుసంరక్షణంబున్ జగత్కంటకధ్వంసనంబున్ దగంజేయుచో నీవు గావించుసత్కార్యముల్ చాలనాశ్చర్యముల్ నీపదాంభోరుహధ్యాన సేనావిశేషంబులన్ నారద వ్యాస వాల్మీకి రుక్మాంగదాదుల్ మహాధన్యులై పుణ్యులై జ్ఞానసంపన్నులై యవ్యయానందముంగాంచిరత్యూర్జితంబైన యుష్మన్మహత్త్వంబు వర్ణింపఁగా రెండువేల్ జిహ్వలన్ బొల్చు శేషాహియుంజాలఁడీ లోకముల్ దేశకాలంబులున్ వేదశాస్త్రంబులున్ దానధర్మంబులున్ సాగరంబుల్ నదుల్ కాననంబుల్ గిరుల్ చంద్రసూర్యుల్ పృథివ్యాదిభూతంబులున్ సాత్త్వికాదిత్రయంబాదిగా నామరూపంబులన్ బొల్చు నేతత్ప్రపంచంబు సర్వంబు నీమాయచేఁ గల్పితంబై భవద్గర్భగోళంబునం బుట్టుచున్ మించుచుం గిట్టుచుం గ్రాలు నో దేవ నీవే జగత్కర్తవున్ ధర్తవున్ హర్తవున్ నీవె సర్వస్వరూపుండవు న్నీవె దైవంబవు న్నిర్గుణంబై నిరాకారమై నిశ్చలంబై నిరాఖ్యాతమై నిర్వికల్పస్థితింబొల్చునోంకార

గమ్యం బరబ్రహ్మమూర్తిన్నినుం నామనోవీథి భావింతుసేవింతునోస్వామి నన్నుం గృపంజూచి రక్షింపు మో దీనసంరక్ష యోపుణ్యచారిత్ర యోభక్తమందార యో నిత్యకళ్యాణ కారుణ్యశాలీ జగన్నాయకా దేవతాసార్వభౌమా రమావల్లభా పాహిమాం పాహిమాం పాహిమామ్. 97

శా. నీ తేజంబుసహస్రమైత్రయుమఁగానిల్వంగశక్యంబుగా
దేతద్విశ్వమునందురక్షకులునాకెవ్వారునున్లేరనీ
వేతప్పన్శరణంబుచొచ్చితిదయావిస్తారభావంబున
న్నాతప్పుల్ క్షమియించికావఁగదవేనాతంఘ్రినారాయణా. 98

క. అనినంగృష్ణుఁడుమత్నా, ఘనమనితరవార్యమగుటఁదగఁదెలిసిరయం
బునమముఁజేరితికావున, నినుఁజెందకుతద్భయంబునిక్కంబింకన్. 99

క. మీయుభయుజ్వరవాద, మపాయంబుననన్నుఁ గావుమనినీవునుతుల్
సేయుటయుఁజనువారల, కీయెడమీబాధపొరయదెంచుకరయైనన్. 100

వ. అని యానతిచ్చెనని శుకుండు పలికిన నట మీఁదటి వృత్తాంతం బెఱింగింపుమని యడుగుటయును. 101

శా. సాష్టాంగానతసిద్ధసాధ్యమకుటాంచన్మాత్నరత్నావళీ
ఘృష్టిస్తోమ విరాజమానవిమలాంఘ్రిద్వంద్వగీర్వాణజి
ద్దుష్టారాతికురంగనిర్దళనశార్దూలాయతోద్యద్భుజా
విష్టంభోజ్వలసర్వదేవమయశశ్వద్రూపవిశ్వంభరా. 102

క. లక్ష్మీకటాక్షకమలా, లాక్ష్మాంచితవదనహారిణలాంఛనబింబా
సక్ష్మాదిభూతవిశ్వగ, సూక్ష్మస్థూలాంతరస్థసుబ్రహ్మకళా. 103

కవిరాజవిరాజితము.

మలయజహారసుధాకరహీరసమానసుసారయశోన్నతది
గ్వలయకృతార్థిహితార్థధనంజయసర్థనకారిసమర్థకృపా
నిలయనిరర్గళశార్ఙ్గధనుర్గుణనిర్గతమార్గణసగ్గమహా
విలయగతాహితమోహితలోకవివేకసమాహితహృన్నహితా.

గద్య. ఇది శ్రీమంగళాచల నృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తి రాయనమంత్రితనూభవసుజనహితకృత్యనిత్యాబ్బయామాత్యప్రణీతంబైనయనిరుద్ధ చరిత్రం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# అనిరుద్ధచరిత్రము

## పంచమాశ్వాసము.

---



కల్యాణగుణోజ్జ్వల
పాకాహితముఖ్యవినుతపదపద్మశర
ద్రాకేందుచంద్రికావిభ
వాకరదరహాసమంగళాద్రినివాసా. 1

గీ. అవధరింపుము శౌనకుం డాదియైన, మునివరేణ్యులతోడ నిట్లనియె సూతుఁ
డా పరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచి విజ్ఞాననిధియైన శుకుఁడు పలికె. 2

గీ. అట్లు కరుణించి పలికిన యచ్యుతునకు, వందనముఁ జేసి చనియె శైవజ్వరంబు
బాణుఁ డపు డట్లు భీతితోఁ బఱచి తనదు, మందిరముఁ జొచ్చి చింతాబ్ధి మగ్నుఁ డగుచు. 3

వ. ఇట్లని తలంచు. 4

మ. అతిరౌద్రారుణ నేత్రకోణములతో నాలీఢపాదద్వయో
న్నతితోఁ జంచలకుండలప్రభలతో నారాచభృన్మండలీ
కృతకోదండముతో జయార్భటములోఁ గృష్ణుండు నాముందటన్
శతకోట్యాకృతులం గనంబడియెడున్ సర్వంబునుం దానయై. 5

చ. గెలిచితి నిర్జరేంద్రు నడికించితి వహ్నిఁ గృతాంతుఁ గొట్టితిన్
జలమున నైఋతిన్ విగతశౌర్యుని జేసితి వార్ధినాథునిం
గలఁచితిఁ ద్రోలితిన్ బవను గర్వ మడంచితిఁ గిన్నరేంద్రునిన్
జెలఁగి మహేశ్వరున్ వశుఁ జేసితి నప్రతిమానకీర్తినై. 6

ఉ. ఇంతమహాద్భుతం బెఱుఁగ నెన్నఁడుఁ గృష్ణఘనుర్విముక్తదు
ర్దాంతశరౌఘతీవ్రతరధాటికి డెందము దల్లడిల్లెడుం
బంతము లెల్ల హాస్యములపాలుగ నద్భుజవిక్రమక్రమం
బింతకువచ్చె దైవకృత మెవ్వరికైన హరింపవచ్చునే. 7

వ. అమ్మహాపురుషుం డాదినారాయణుండగుట తప్ప దతనితోడి సంగ్రామంబువలన
నెట్లైన లెస్సయని ధైర్యంబుఁ దెచ్చుకొని రోషభీషణాకారుండై. ౮

ఉ. హాటకకిరీటకుండలముఖాభరణోజ్జ్వలుఁడై సహస్రబా
హారుచిరాయుధప్రకరుఁడై బిరుదధ్వజఘంటికాస్వనో
దారరథస్థుఁడై తురగదంతిరథాదిక చాతురంగసే
నారభటీకఠోరతరుఁడై పటహధ్వనులుల్లసిల్లఁగన్. 9

గీ. శోణనగరంబు వెలువడి సురవిరోధి, ధరణికంపింప నేతెంచి తాఁకుటయును
యాదవబలంబు విక్రమం బతిశయిల్ల, మారుకొని రణం బతిఘోరమయ్యె. 10

సీ. శరపరంపరలచే సైన్యంబు ప్రగ్గంగ రథములు పఱపిం దురథికవరులు
రథికుల పైఁ గుంజరముల దీకొల్పి గర్వమునఁ దాఁకెడు గజవాహకులును
గజవాహకుల మీఁదఁ గంఖాణములఁ దోలి తత్తులనఱకు రాహుత్తగములు
రాహుత్తులను బరాక్రమలీల శోభిల్లఁ జేరి యాఁటెలఁ గ్రుమ్ము వీరభటులు

తే. నగుచుఁ బోరాడె రోషంబు లతిశయిల్ల, నుభయచతురంగబలములు నుక్కుమిగిలి
పలలఖాదనభవకుతూహలపిశాచ, కంఠకోలాహలమున నాకసము వగుల. 11

వ. అప్పుడు. 12

మ. హరిపై బాణుఁ డహంకృతిం గదిసి బాహాపంక్తి నొక్కుమ్మడిన్
శరముల్ తోమరముల్ గదల్ ముసలముల్ చక్రంబులున్ బ్రాసముల్
పరిఘంబుల్ కరవాలముల్ పరశువుల్ ప్రాసాది నానాయుధో
త్కరముల్ శైలము గప్పు మంచు పగిదిం గప్పెట్టఁగా నేసినన్. 13

చ. భుజబలశాలి మాధవుఁడు పూనికనుగ్రగుణటంకృతిన్ హరి
ద్గజముల కర్ణముల్ వగులఁగా నిశితోగ్రశశాంకసాయక
వ్రజములు పింజపింజఁ గరుసం బరఁగించి తమంబడంచు నీ
రజహితు లీల సాధనపరంపరలం దునుమాడి త్రిప్పఁతన్. 14

మ. విజయోత్సాహము మోమునం బొదలఁగా విశ్వంభరాండార్చ్యము న
క్కజమై తేజము దిక్కులన్ వెలుఁగ నాగారాంగుఁడై తోయధిఘో
రజవస్పర్శనమున్ హరామరవర బ్రహ్మాదిక ప్రార్థనక్రొ
న్నిజసందర్శనమున్ సుదర్శనమును న్నిద్ర ప్రతాపంబునన్. 15

వ. ప్రయోగించిన. 16

మ. చటులంబై చలితక్షమాతలమునై చంద్రార్కకోటిప్రభా
ఘుటితాశాంతరమై చరాచర సమాక్రాంతాగ్నికీలాసము
త్కటమై చండతరాంశువై చకితరక్షశ్చక్రమై చక్రమా
ర్భటితో వచ్చి వియచ్చరుల్ జయజయారావంబుతో మ్రొక్కఁగన్. 17

వ. సముద్దండ వేదండ ప్రకాండ శుండాదండమండితంబును, గనత్కనకకంకణకేయూర
ముద్రికానిచయఖచిత ప్రచురమణిగణమరీచిమాలికాలంకృతంబును త్రైలోక్యభయం

కరకారణ సౌభాగ్యరేఖావళీ కలితారుణకరతలంబును, చంద్రశేఖరమనోరంజితతాళ ప్రమాణలయాలయవ్యాప్తివిస్తారతరంగన్మృదంగవాద్య ఘాతకారిణ్యంగుళ్యాభిరామంబును, నక్తంచరీకుచకుంభయుగళచర్చితతుహినజలమిళితపటీరకర్దమసురభిఘుమఘుమాయమానంబును నైనబాణాసురునిబాహుసహస్రంబునంతఁ జతుష్టయావశిష్టంబుగాఖండించి వైచిన ఝంఝామారుతవిక్షేపవిదళిత శాఖాసహస్రంబై మోడ్పడి యున్న మహామహీరుహంబుచాడ్పునఁ బురందరకరాంభోరుహ శంఫద్దంభోళి ధారాహతపక్షంబై యున్న కుంభినీధరంబువిధంబున నుండెనప్పుడు. 18

క. సురుచిరసురనికరకరాం, బురుహవికీర్ణప్రసూనపుంజములొఁ బై
హరిపైఁ గురిసెన్నారసెఁ, బరుసఁ గారంభాదనాట్యవాద్యరవంబుల్, 19

తే. అవ్విరోచనపౌత్త్రుని యందుఁ జాల, కరుణగల్గుటఁ జేసి గంగాధరుండు
పురుషసూక్తంబు చదువుచు హరిని జేరి, వినయవాక్యప్రయుక్తి నిట్లని నుతించె. 20

చ. అనఘుఁడవప్రమేయుఁడవనంతుఁడవాద్యుఁడవక్షరుండ
వత్యనుపమదివ్యయుండవు చరాచరజాలసమేతమైనయి
వ్వనజభవాండపఙ్క్తులు భవజ్జఠరంబున నీదుమాయచే
జననము వర్ధనంబున వసానము నొందుచునుండు నీశ్వరా. 21

సీ. అఖిలాత్మ నీనాభియందు నాకాశంబు మునివంద్య నీపాదములను ధరణి
సర్వేశ నీమానసమునఁ జంద్రుండును జలజాక్ష నీనేత్రముల నినుండు
గాంభీర్యనిధి నీముఖంబున నింద్రుండు మురహర నీకర్ణములను దిశలు
నగగేంద్రశయన నీయూర్పుల ననిలంబు ఘనమూర్తి నీమస్తకమున దివము

తే. ప్రబలముగ నుండు నుపనిషత్ప్రపంచకమయ, దివ్యమంగళవిగ్రహస్థితి వెలుంగు
నిన్ను భావించి సేవించి సన్నుతించి, కాంతురనఘులు మోక్షంబుఁ గమలనాభ. 22

క. అనిమహియబహువిధంబుల, వినుతించు శశాంకధరుని వినయోక్తులకున్
జనితప్రమోదమానస, ననరుహుఁడై పలికె గరుడవాహనుఁ డెలమిన్. 23

ఉ. నీదయ పీనిపైఁ గలిమి నిక్కమమింతియె కాదు వీఁడు ప్ర
హ్లాదునకుం బ్రపౌత్త్రుఁడు తదన్వయజాతుల నేవధింపఁగా
లేదటు గాన శ్రీన మెడలింపక కాచితి బాహువిక్రమో
న్మాదము డించి గాసిలిసి మ్రొక్కినఁ గాంచితిఁ జంద్రశేఖరా. 24

క. ప్రమథగణంబులలోను, త్తముఁడై భవదీయసన్నిధానంబున మో
దముతోడ నుండఁగలఁడీ, యమరాహితుఁడింక నోపురాసురమథనా. 25

తే. అనుచు నానతియిచ్చె నయ్యవసరమున, బాహువులతోన యజ్ఞానబంధములను
వీడుకొని మాధవుని జేరి వినయఘణితిఁ, జాగి మ్రొక్కుచు బాణుండు సంభ్రమమున. 26

శా. మాయామానుషమూర్తివై తనరు బ్రహ్మంబున్ని వాఙ్మానసా
ధ్యేయుం నిన్నెఱుంగలేక నవనీతిస్తాఋకొన్నందుకుం
ప్రాయశ్చిత్తము గాఁగఁ జేసితి వినాపాపంబు లోపంబు గా
నా యజ్ఞానము వాసెనీ కరుణఁ గృష్ణా గోపికావల్లభా. 27

వ. అని మఱియుం బునఃపునః ప్రణామపూర్వకంబుగా బహుప్రకారంబులం బ్రస్తుతించి యుషాకన్యానిరుద్ధకుమారులం గైచేసి తోడ్కొని రమ్మని పరిచారకులం బంచిన వారును దదీయశుద్ధాంత కాంతాజనంబులకుం దెల్పిన నవ్వధూవరుల నుచితోచారంబులం బ్రీతులంజేసి యలంకరించి రప్పుడు. 28

సీ. కంకణఝణఝణత్కారానుగుణముగా హస్తపద్మములు నాట్యములు సలుప
హస్తపద్మములనాట్యములతో నుద్దియగు గుత్తంపుగుబ్బలు కులికియాడ
గుత్తంపుగుబ్బలకులుకుతో నైక్యమై కంఠహారంబులు గంతులిడఁగఁ
గంఠహారంబులగంతులజతఁ గూడి పిడికెడునడుము దాఁ బెళుకఁ జూప

తే. విమలహరినీలరుచులతో వియ్యమంద, మఱుకుమారునినునుసోగకురులయందు
లలితచాంపేయసురభితైలంబు నించి, యొలమిఁ దలయంటె నొక్క పూర్ణేందువదన.

క. నలుఁగిడియె నొక్క కోమలి, జలయజపంకంబులం బెమఱియొక్క తెని
ర్మలకనకకలశములజల, కంబొనరించెఁ గుసుమశరపుత్త్రునకున్. 30

క. తడియొత్తె నొక తెవలిపెపు, మడుఁగులు గట్టంగ నిచ్చె మఱియొక్క తె యిం
పడరంగ నగరుధూపం, బిడె నొక్క తె పరిమళంబు లెంతయు నెసఁగన్. 31

తే. అర్ధచంద్రోపమంబైన యతనినుదుట, దిద్దె నొక్క తె కస్తూరితిలకమనియుఁ
దనరెఁ గందర్పకుసుమకోదండదండ, ఘటితనీలోత్పలాస్త్రసంకాశమగుచు. 32

ఉ. ఒక్కలతాంగి మౌక్తికసముజ్జ్వలభారముఁ దువజ్రపుం
జెక్కులతాళిబిళ్ళ విలసిల్లఁగఁ గూర్చి యలంకరింపఁ బెం
పెక్కి తదీయవక్షమున నెంతయుఁ జూడఁగ నొప్పె నయ్యెడన్
జుక్కలగుంపులో మిగుల శోభిలు పూర్ణశశాంకుకైవడిన్. 33

చ. శ్రవణపదావిలగ్నమకరప్రకటాభరణోజ్జ్వలాస్యకై
రవహితులీల నాఘనుఁడు రాజిలె నీలరుచిం దళత్తళల్
గవయఁ బ్రజానురాగకరకఁకణముల్ప్రవహింపఁ జూచి గా
రవగుణసంప్రపూర్ణ జలరాశికదా యని తజ్ఞు లెంచఁగన్. 34

గీ. నిలువుటద్దంబు ముందఱ నిలిపె నొక తె, యందుఁ బ్రతిబింబితంబైన యతనిరూపు
జూచి భ్రమనొందె యొక్క తె సురటివీవఁ, జెలులు ఘొల్లున నగిరది సిగ్గుపడఁగ. 35

సీ. సరసప్రవృత్తస్తని గురులీలఁ నరమహోత్పలమాలఁ దవియింపఁ బ్రౌఢవమ్మ
వరమహోత్పలవైరివదన నీలాంబరాలంకృతి సేయ వలంతివమ్మ

యంబరోపమమధ్యయందంబుగా ఘనసారంబులందంగ జాణవమ్మ
ఘనసారకచనీవ్రకంకణాభరణంబులందగింపవినోదురాలవమ్మ
తే. యనుచుఁ బూర్ణేందువదన లవ్యంగ్యవచన, రచనఁ జెలు లవ్వు మోములరహివహింప.
వినుతభూషణభూషితాంగునిగఁ జేసి, రపుడు యదువంశజలధితారాధిపతిని. 36

క. కొందఱు చెలికత్తెలు పా, సుందరిఁ గైచేసి రపుడు సురుచిరభూషా
చందనకుసుమాదులచేఁ, గందర్పనిరాజ్యలక్ష్మిగతిఁ జెలువొందన్. 37

సీ గిలుకుటందియఁ జెక్కి నవరత్నములకుఁ బాదసరోజనఖకాంతి తళుకు లిడఁగఁ
బ్రతిలేనిముక్కరపైఁ గెంపులకు ముద్దుమోవిచెంగావి మేల్మెసుఁగు దిద్ద
నిగిడి చేర్చుకప్పు లోనీలంబులకుఁ గుంతలచ్ఛాయ శృంగారలక్ష్మి నొసఁగఁ
దాటంకమౌక్తికతతికి మందస్మితరసము లావణ్యవిభ్రమము నించ
తే గటక కేయూరరశనాదికనకము వసు, నమరు మైజిగి యన్నియు లతిశయింపఁ
దొడవులకు నెల్లఁ దన మేను దొడవు గాఁగ, రహివహింపుచునుండె నారాజవదన. 38

మ. కమలాక్షుం డ్లగనవ్వధూవరుల శృంగారించి రత్నప్రభా
విపులంబైన రథంబు మీఁదనిడి శ్రీవిన్వల్లకీ వేణుశం
ఖమృదంగాదిక వాద్యసంజనితమాంగల్యధ్వనుల్లాస్యకా
సమమంజీరఝుళంఝుళధ్వనులు హెచ్చన్ రాజమార్గంబునన్. 39

మ. చను దేరంగఁ బురంధ్రులున్నతమహాసౌధంబులన్నిల్చి హ
స్తనటత్కంకణనిక్వణంబెసఁగ లాజల్చల్లి రాత్రావలో
కననీలోత్పలదామసంయుతములై కన్పట్టి కాంతిస్ఫుర
ద్ఘననీలోత్పలమాలికాకలితముక్తాజాలలీలం దగన్. 40

చ కలికియొకర్తు వారలనుగన్గొనఁ బోవుచుఁ గంఠమాలికల్
గళమున వైచుకోక తమకంబున గుబ్బలమీఁదఁ జేర్చినన్
గులికెడు చూచుకంబులఁ దగుల్కొని చూడఁగ నొప్పె నెంతయుం
బొలుపగు తంత్రులం బొలుచు బుత్తడికాయలవీణకై వడిన్. 41

చ. అలికులవేణి యొక్కతె సహస్రదళంబు వినోదలీలఁ గో
మలకరపంకజాతమున మాటికిఁ ద్రిప్పుచు నేగుదెంచి యిం
పలరఁగ నవ్వధూవరులనయ్యెడఁ గన్గొనుచుండె వేయుగ
న్నులన లెవ్వరియందముఁ గనుంగొనఁ గానని తెల్పు కైవడిన్. 42

సీ. ఈభానుతేజునకీ కోకకుచకును జెలిమిసంఘటనంబు చేసినాఁడు
ఈచంద్రవదనునకీ చకోరాక్షికి వెలయ నేస్తంబు గావించినాఁడు
ఈమేఘవర్ణునకీ కేకిగమనకుఁ గోరి సాంగత్యంబుఁ గూర్చినాఁడు
ఈపద్మహస్తునకీ భృంగవేణికిఁ బ్రియవిలాసంబుఁ గల్పించినాఁడు

తే. ఎంత నేర్పరి శారదాకాంతుఁ డహహ, యిట్టి యనుకూలదాంపత్య మెఱిఁగిచేసె
ననుచుఁ బురభామినులు ప్రమోదాత్మలగుచుఁ, గూడి తమలోన ముచ్చటలాడి రపుడు.

వ. ఇట్లు చనుదెంచిన కూఁతు నల్లునిం జూచి ప్రమోదరసభరితస్వాంతుండై బాణుండు వారల కనేకరత్నాభరణవస్తువాహనధేనుదాసదాసీజనంబుల నుపాయనం బొసంగి, వాసుదేవసన్నిధికిం దోడ్కొనిపోయి యప్పగించిన గృతప్రణాములై యున్నవారలం గనుంగొని యతండు. 44

క. కనికరపు ముదంబునఁ జి, క్కని కరములఁ గౌఁగిలించి కాంతాయుతుఁ డౌ
మనుమని సుఖాన్వితుఁడవై, మనుమని దీవించె సబహుమానము గాఁగన్. 45

మత్తకోకిల. గారవంబున మ్రొక్కఁ గైకొని కౌఁగిలించెడివారలున్
జేరి మ్రొక్కఁ దదాదరోక్తులచేఁ జెలంగెడువారలున్
గోరి కన్నులు చల్లఁగాఁ గనుఁగొంచునుండెడివారలున్
గూరిమిన్ బలముఖ్యులున్నతకోటియుం బ్రముదంబునన్. 46

వ. అంత. 47

ఉ. బాణుని గారవించి పురభంజను వీడ్కొని శంఖనాదని
స్స్వాణధణంధణల్ సెలఁగ సామజఘోటకముఖ్యవాహినుల్
శ్రేణులు గట్టి విక్రమవిజృంభణ తన్ను వెంటరాఁగ గీ
ర్వాణవిలాసినీమృదుకరస్రుతసూనరసప్లుతాంగుఁడై. 48

శా. కాంతం దోడ్కొని బ్రహ్మసూసహితులై కందర్పముఖ్యుల్ మహా
సంతోషంబున నేఁగుదేర యదువంశస్వామి కల్లోలినీ
కాంతారాచలపట్టణావళుల నేకంబుల్ గనుంగొంచుఁ ద
త్ప్రాంతక్షోణిపతుల్ సువస్తునికరం బర్పించి సేవింపఁగన్. 49

వ. కతిపయదినంబులకుం జనిచని 50

సీ. గోత్రాధిపఖ్యాతిఁ గొమరారి యుండుట సురశైలరాజభూసురులఁ బోలి
మకరాంకసంవర్తిమహిమఁ జెన్నొంగుట గగనకిన్నరవరాంగజులఁ బోలి
ఘనరసాలంకృతుల్ గనుపట్టియుండుట హరజటాసిద్ధకావ్యములఁ బోలి
హరిచరణప్రభూతాభిముఖ్యంబాట బలిదానవనాకములను బోలి
తే. రంగదుత్తుంగచటులతరంగనటన, భంగకల్లోలజాలసంభ్రమనినాద
పూరితాశాంతరాళమై పొలుచుచున్న, పశ్చిమాంబుధిఁ గనియె గోపప్రభుండు. 51

క. కనుఁగొని మనమునఁ బెనఁగొను, ననురాగమువలన వికసితాననుఁడై యిం
పెనయఁగ నిష్టాలాపము, లొనరించుచు నరిగె యాదవోత్కరములతోన్. 52

ఉ. వారిజలోచనుండు యదువల్లభుఁ డేగుచుఁ గాంచె ముందటన్
ద్వారకఁ జంచలాంచితలతాకలితాసితమేఘమాలికా

కారవిలాసకృత్సరసకంజముఖీనికరప్రచారవి
స్తారసురేంద్రనీలఖచితస్ఫుటహర్మ్యకదంబధారకన్. 53

ఉ. అంతకుమున్నకృష్ణునిజయంబ భియాతిపరాజయంబు పా
కాంతయుఋశ్యకేతుఁడుసుఖస్థితిఁజొచ్చుటయాదియైనవృ
త్తాంతముచారసూక్తిఁదెలియన్వసుదేవుఁడుపౌరకోటిశు
ద్ధాంతజనంబులున్వినిమహాప్రమదాంబుధినోలలాడుచున్. 54

వ. పట్టణంబు శృంగారంబు సేయించిన. 55

సీ. ఘనసారకస్తూరికాజలాసారంబుచెలువంపువీథులఁజిలుకరించి
గమకంబులైనముక్తాఫలంబులతోడలీలతోరంగవల్లికలుదీర్చి
నవరత్నభూషణాంబరసుగంధద్రవ్యపుంజంబులంగళ్లఁబొందుపఱిచి
కదళికాస్తంభముల్ఘనచిత్రపటములునుభయపార్శ్వములఁబెంపొందనునిచి

తే. ద్వారములయందుఁదోరణావళులుగట్టి, పరిమళముమించునగురుధూపములువైచి
నృత్తగీతవాద్యాదులనెఱపఁజేసి, యమితశృంగారమొనరించిరప్పురంబు. 56

ఉ. భూసురవేదనాదములఁబుణ్యసతీజనమంజులోక్తులన్
భాసురనృత్తగీతరసబంధురరావములంబురీవనీ
వాసకుకానులాపములవారణబృంహితివాజిహేషలన్
శ్రీసముదంచితంబగుచుఁజెల్వువహించెఁబురంబునవ్యమై. 57

గీ. అట్లుశృంగారితముఁజేసియఖిలజనులు, గంధపుష్పాక్షతాద్యలంకరణులగుచు
నెదురుగానేగుదెంచిరమేశుఁగాంచి, మ్రొక్కి యనిరుద్ధుఁగొల్చిప్రమోదులైరి 58

క. పురలక్ష్మిసరసతరనిజ, సరసీతామరసరసలసన్మృదులీలా
సురభిపరిభోగపవనాం, కురమిషమునహరికినెదురుకోలువహించెన్. 59

ఉ. గోపురశాతకుంభమయకుంభపయోధరకుంభజృంభణల్
చూపుచుసౌధయూథపరిశోభితహీరదరస్మితంబులు
ద్దీపనసేయుచున్నలదుదీర్ఘపటాగ్రపతాకహస్తవి
క్షేపణసన్నసేయుచువశీకృతచిత్తునిజేసెఁగృష్ణున
ట్లాపురలక్ష్మికాంతునిబ్రియాంగనమోహితుఁజేయుకైవడిన్. 60

వ. ఇవ్విధంబునం బ్రకల్పితశృంగారతరంగరంగద్రంగవల్లీప్రయుక్తముక్తాఫల తార
కాలంకృతంబును, కుట్టిమరేఖాస్థగితప్రదీప్తహీరద్యుతివితత కౌముదీరమ్యంబు
ను, సకలజననయన కువలయవికాస హేతుకంబునునైన రాజమార్గంబున యదు
కులపయఃపారావారచంద్రుండగు దేవకీనందనుం డరుగుచున్నసమయంబున. 61

ఉ. బంగరుపళ్లెరంబులనుబద్ధముఖుల్ఘనసారదీపికల్
రంగమరంగనించిమణిరాజితకంకణహస్తపల్లులన్

సంగతినుంచిత్రిప్పుచునుసారెకుమంగళికౌశికస్వయం
మంగళమంచుఁబాడిరిసముంచితపంచమనాదవైఖరిన్. 62

గీ. నందకాయుధునకుశోభనంబటంచు, నగరకాంతలునీరాజనంబులిడుట
కలపతాకహస్తంబులనభినయించెఁ, బురరమాదేవిభరతవిస్ఫురణఁదెలసి. 63

క. నిరుపమవిమానపఙ్క్తులు, గురుతరమణిహర్మ్యములునుగూడివెలుంగన్
సురకాంతలుఁబురకాంతలు, సరిచల్లెడువిరులనానజడిమైకురిసెన్. 64

వ. అప్పుడు. 65

సీ. తాళకేతనసముద్యత్కాంచనాస్యందనారూఢుఁడైనవాఁడతనిఁజూడు
నాగాంతకధ్వజోన్నతహేమమయశతాంగారోహణుండైనయతనిఁజూడు
మకరపతాకాసమానగాంగేయరథాసీనుఁడైయున్నయతనిఁజూడు
వరఋశ్యకేతుసుందరమైనకనకంపుటరదంబుపైనొప్పునతనిఁజూడు

తే. వతఁడుబలరాముఁడతఁడుమురాసురారి, యతఁడుకుసుమాయుధుండతండతనితనయుఁ
డనుచునొండొరుబలుకఁదెల్పుకొనుచునుండి, రప్పురంధ్రులుగగనగృహాంతరముల. 66

ఉ. కైరవిణీప్రియేశువెనుకంజనురోహిణిలీలనింపుసొం
పారఁబ్రసూనసాయకసుతానుగతింజనుదెంచనయ్యుషా
వారిజగంధినంచితసువర్ణలతాసమమోహనాంగిశృం
గారరసంపుబొమ్మఁబొడగాంచిపురంధ్రులుసమ్మదమ్మునన్. 67

వ. తమలోనిట్లనిరి. 78

ఉ. తేనియలూరుకెంపుసుదతీమణివాతెరచంపకద్రవం
బాపెడితేఁటిగుంపువిమలాంగికచంబుసదావికాసముల్
బూనుసరోజముల్చిగురుఁబోఁడికనుంగవజోకరొప్పెడున్
మానినిచక్రవాకములుమానినిచన్నులుచూడుమాసఖీ. 69

చ. కలువలపేరుపేరుకొనఁగాఁగుముదమ్ములుమన్మథాంబకం
బులుగణుతింపఁగావిషమములకుమలంబులపుట్టుపూర్వముల్
దెలియఁగఁబంకజాతములుతేరికనంగొనఁగామెఱుంగుఁదీఁ
గెలుచపలంబులన్నియుసఖీమణికన్నులఁబోలనేర్చునే. 70

క. కలదనుచునులేదనుచును, బలుమఱువాదంబులేలపనిలేదింకన్
గలదనుటకులేదనుటకుఁ, దలపంగానడుమునడుముతరుణీమణికిన్. 71

మ. చెలువంబైకళలన్వెలుంగుహరుమంజీరేశపున్ముత్తియం
బులతోఁగూర్చినచేరుచుక్కనొసటన్బొల్పొందునెమ్మోమహా
చెలికెంతందముచూడరమ్మరుచిరాశ్లేషాసమాయుక్తని
ర్మలరాకాతుహినాంశుమండలముసామ్యంబైప్రకాశించుటన్. 72

చ. పురుషులలో నపూర్వరసపూర్ణ శరీరమనంగసూతికిం
దరుణులలో సమానరహితంబగు రూపము బాణపుత్త్రికిన్
సరసముగా సృజించియిటు సమ్మతినిద్దఱఁగూర్చినట్టియా
సరసిజగర్భుఁ డెంతగుణశాలితలంపఁగఁ బాటలాధరా. 73

వ. అని యనేక ప్రకారంబులం గొనియాడుచునదియె ముచ్చటగానుండినప్పుడు, పురుషోత్తముండు భేరీమృదంగాదివాద్యంబులును, శంఖకాహళ వేణుప్రముఖతూర్యంబులును, బోరుకలఁగ మహావైభవంబున నరిగి నిరంతర విహార్యమాణేందిరంబగు మందిరంబుఁ బ్రవేశించి, యమాత్యజ్ఞాతిసామంత బంధుమిత్త్రాదిపరివారంబులదివ్యాంబరాభరణతాంబూలాదివస్తుప్రదానంబులం బ్రహృష్టమానసులంజేసి, యుచితప్రకారంబులఁదత్తద్గృహంబులకు వీడుకొల్పి, యంతఃపురంబులకుంజని యిష్టోపభోగంబులను భవింపుచుండె నయ్యనిరుద్ధకుమారుండు నుషాసమేతుండై దేవకీవసుదేవులకు రేవతీరుక్మిణీసత్యభామ జాంబవతీ కాళిందీ మిత్త్రవిందాసుదంతా భద్రాలక్షణాదులైన ముత్తైదువలకుఁ దన తల్లులైన రతీశుభాంగులకుఁ బ్రణామంబులుచేసిన వారును బరమానందరసప్రహితాంతరంగులై యవ్వధూవరుల నాలింగనంబులుచేసి యనేకవిధంబుల దీవించిరతండును నిజవియోగ వేదనాభారంబునఁ గృశీభూతయైయున్న రుక్మలోచన ననేకవిధంబుల గారవించి సంప్రీతమజ్జనభోజనాదులఁ దృప్తుండై బాణనందనాసురత సంభోగానంద నిరతుండై యుండి. 74

సీ. సారససంసారసరసరసాసార సౌరభాన్విత సరశ్చారణముల
సాలలీలాలోల ఖేలదేలాలతా జాలడోలాకేళిలోలగతులఁ
గింజల్కరంజితమంజీర పుంజమంజులపంజులనికుంజసుమనసములఁ
గుందబృందమరందబిందు పేదిందిరామంద నాదశ్రుతానందములను
తే. గారఘనసారనీహారనీరపూర, సారచారుపటీరచర్చాసుఖాప్తి
కోకకోకిలశారికానీల కేకి, శౌకలోకాకరవనావలోకనముల. 75

శా. ప్రాంచత్కాంచననూత్న రత్నఖచితప్రాసాదదేశంబులం
బంచాస్త్రప్రియనందనుండుసురతప్రాపంచికవ్యాప్తిఁగ్రీ
డించున్ దక్షిణనాయకత్వమునఁబ్రౌఢిన్ రుక్మ నేత్రామన
స్సంచారుండును బాణదైత్యతనయాసక్తాంతరంగుండునై. 76

సీ. కుచకుంభయుగముఁ బైకొనికేలనంటుట నైరావతము నెక్కి యాడినట్లు
కదియించి నెమ్మేనుఁగౌఁగిటనలముట హరిచందనము మేననలఁదినట్లు
సునయోక్తివీనులుసోకుటనప్సరోవీణానినాదంబు వినినయట్లు
బింబికాధరచూషణంబు సేయుటయుసుధాసారపానంబుచేసినట్లు

తే. సౌఖ్య మొదవంగ నిచ్చనిచ్చలును బాణ, కన్యసంభోగ మింద్రభోగంబు గాఁగ
సతతవిభవానుభవతృణీకృతపురంద, రుండగుచు నుండె నయ్యనిరుద్ధవిభుఁడు. 77

వ. అంత. 78

గీ. మందగతులకునత్యంతమందగతియు, మంజులాలోకులకతిశయమంజులంబు
మెఱుఁగుమేనికి మిక్కిలి మెఱుఁగు నగుచుఁ, బుష్పగంధికి నీళ్లాడఁ బ్రొద్దులయ్యె. 79

వ. అంత. 80

శా. స్వక్షేత్రంబుల నుచ్చరాసుల హితస్థానంబులన్ దీప్తులై
యక్షీణుండగు చంద్రుఁ జూచుచు దినేశాదుల్ చరింపన్ సము
గ్రక్షేమంకరలగ్నవేళ శుభయుక్తంబందు రాజాంశఁ బ
ద్మాక్షీరత్నము పుత్త్రుఁ గాంచె హరిపూర్ణాంశావతీర్ణాంగునిన్. 81

క. సురదుందుభినాదంబులు సురకరనిర్ముక్తకల్పసుమవర్షంబుల్
సురరమణీనాట్యంబులు, సురగాయకగానములును శోభితమయ్యెన్. 82

ఉ. యాదవవృష్ణిభోజకులులందఱు వేడుకలం జెలంగిర
త్యాదరవృత్తి బాణతనయారమణుండును సువర్ణధేనుర
త్నాదిసమస్తవస్తువులనంతముగాఁ జెలఁరేగియిచ్చి పృ
థ్వీదివిజేంద్రకోటులను దృప్తులఁ జేసి కృతావగాహుఁడై. 83

క. లౌకికవైదికరీతులఁ, గైకొని పుత్త్రోత్సవంబు గావించి యతం
డేకాదశదినమున విభ, వాకరముగ నామకరణయత్నముఁ జేసెన్. 84

క. వజ్రాదిభూషణుండును, వజ్రాంగుఁడు వైరివీరవసుధాధరభి
ద్వజ్రుఁడునై మెలఁగెడునని, వజ్రుండని నామమిడిరి నరవిప్రోక్తిన్. 85

సీ. చూడఁగా నేర్చె విస్ఫుటకృపామృతరసంబుఁ గటాక్షవీక్షలఁ బూనుకొఱకు
నడుగు చాఁపఁగ నేర్చె నఖిలరాజన్యకిరీటదీప్తులలంకరించుకొఱకు
చేతులాడింప నేర్చె నువదాన్యతాపాత్రవిద్యాప్రవీణత వెలయుకొఱకు
తలయెత్త నేర్చె మన్యమజగన్మండలైకాంతపత్త్రచ్ఛాయ నమరుకొఱకు
తే. పలుక నేర్చె సరస్వతీప్రకటనాట్య, రసమున కురంగరక్తుల నొసఁగుకొఱకు
కడఁగి నడువంగ నేర్చె నుగలియుగాది, మప్రభుత్వతధర్మంబు మలుపుకొఱకు. 86

వ. మఱియు నబ్బాలకుండు ముక్తామణినివహఖచితకలాపకాకపక్షాలంకృతవిశాలఫాలఫలకుండును, నంజనరేఖారంజితకర్ణాంతవిస్తీర్ణనేత్రుండును, దష్టచామీకరముష్టీకృతశార్దూలనఖాభరణకమనీయకంబుకంధరుండును, ననంబరనితంబబింబాలంబితకనకకటిసూత్రకలితకింకిణీక్వణనాదాభిరాముండును, మణిమయమంజీరసింజానసముజ్జ్వలచరణయుగళుండును నై ముద్దుచూపుచుఁ దల్లిదండ్రులు దాతముత్తవలుం బ్రపితామహప్రపితామహీసమూహంబులు గారాబంబు సేయుచుండ ననుదినవర్ధమానుండై పెరుగు

చుండం దదీయసౌకుమార్య మందహాసమృదువచనసంచరణాదుల కానందంబువహిం
చుచు నయ్యనిరుద్ధుండు సుఖోన్నతుండైయుండె. 87

మ. గతగర్వంబునఁ బ్రాంతదేశధరణీకాంతుల్భజింపంగద
ర్పితులై కొందఱుదూరభూవరులు నిర్భీతిం జరింపన్ మహో
న్నతిదండెత్తి జయించి లోఁబఱచి యాజ్ఞాసిద్ధిఁ గావించెఁ దాఁ
జతురంభోనిధిమధ్యఖండనవకచ్ఛప్పన్నదేశంబులన్. 88

ఉ. అన్యనృపాలకుల్వశులై కొనివచ్చి రొసంగువస్తువుల్
కన్నెలు రత్నముల్హారులు గంధగజంబులు నాదిగాఁగ సౌ
జన్యతఁ దెచ్చి తాతకనిశంబును గానుకలిచ్చి యాజగ
న్మాన్యుని చేత దీవెనలు మన్ననలందుచునుండె వెండియున్. 89

సీ. వసుదేవబలదేవవాసుదేవాదుల యనుమతి వడసి యత్యంతనియతి
రాజసూయమ్ముతురంగమేధము నాదిగాఁగ ననేకయాగములు చేసి
యందునాహుతులైనయలపురుహూతాదులాత్మభాగహవిస్సులాహరింప
నాజ్యప్లుతంబుగా నన్నభక్ష్యాదుల నవ్వారిగాఁగ సమస్తజనుల
తే. కిడుచు నధ్వర్యముఖ్యులకెలమి ధేను, భూహిరణ్యరత్నాదులు భూరిగాఁగ
దక్షిణలొసంగి రాజూఁదగు విధముల, నంపకముచేసి కీర్తులనతిశయిల్లె. 90

సీ. అసమానసాంప్రదాయకశుద్ధిఁ జెలువొందు తండ్రితాతలమహత్త్వంబుఁ జూచి
యష్టదిక్కులయందు నాక్రాంతమైనసత్కీర్తిప్రతాపవిస్ఫూర్తిఁ జూచి
కులరూపగుణములఁ గొనియాడఁగాఁదగు దేవులయనుగుణస్థితులఁ జూచి
వర్ధిష్ణుఁడై శైశవంపుముద్దులు గుల్కు తనయుని యందసందములు చూచి
దానభోగాదులైన సద్వ్యయములందుఁ, బొలుపడియున్న యర్థసంపదలు చూచి
భూప్రజలు వేయునోళ్లను బొగడుచుండు, డెంతధన్యాత్ముఁడీయుషాకాంతుఁ డనుచు.

వ. ఈసమయంబున. 92

క. నారదుఁడు సకలశాస్త్రవి, శారదుఁడు శరీరవిజితశారదవేళా
నీరదుఁడు ముఖనివేశిత, శారదుఁడే తెంచె దనుజసంహారుకడకున్. 93

క. ఘనజాతనయునిఁ బొడగని, వినుతులు గావించి యతని వినయంబులచే
ననుమోదమానసుండై, యనిరుద్ధుండున్న యెడకు నరిగిన నతఁడున్. 94

గీ. ఎదురుకొని వందనము చేసి హేమపీఠ, మునను గూర్చుండఁ బెట్టిన మునివరేణ్యుఁ
డాదరంబున దీవించి యతనితోడ, నుచితసల్లాపములు సేయుచుండి యుండె. 95

గీ. ముద్దుగుల్కెడు మరువంపు మొలకయనఁగ, శ్రీలఁ జెలువొందఁగల నెలబాలుఁ డనఁగఁ
గుదురుచక్కని సింగంపుఁ గూన యనఁగ, మీఱు మారుకుమారుఁ గుమారుఁ జూచి. 96

క. రమ్మని డాయంబిలిచిన, యమ్మునినమ్మునినిజాంకమందునిచితదీ
యమ్మగుసాముద్రికచిహ్నమ్ములు దెలియంగఁ జూచియనిరుద్ధునితోన్. 97

సీ. భుజనేత్రనాసికంబులు జానుహనువులునైగుదీర్ఘములుగోప్యాంగకంఠ
జంఘలుమూడుహ్రస్వములుఫాలమురొమ్ముకటియూఁడుపెడఁదలుకంఠనినద
మునునాభికందంబు మూడుగంభీరములు లోఘ్రాణకటిస్కంధ బాహుకుక్షి
ముఖములారున్నతంబులు జత్రుశుభ్రత్వగంగుళిచరణంబులైదుసూక్ష్మ
తే. ములుదృగంతజిహ్వోష్ఠాధరములునునఖర, తాలుకరరేఖలారురక్తములునైన
యట్టిమానవుఁడధిక భాగ్యాన్వితుండు, గానెఱుంగుముకుసుమమార్గణకుమార. 98

సీ. వరలీలదక్షిణావర్తరేఖాయుత భూమిమధ్యుఁడుసమస్తభూమినేలు
నైదురేఖలుఫాలమందున్నవాఁడుదీర్ఘాయుస్సమన్వితుండైనవాఁడు
ఊర్ధ్వరేఖలుపాదయుగళంబునందుఁ బెంపొందుమానవుఁడుమస్తసౌఖ్యయుండు
తనరిముప్పదిరెండుదంతముల్గలిగినయట్టినరుండుభాగ్యాధిపుండు
తే. కంబుసన్నిభమైనట్టిగళమువాఁడు, విలసితంబగుకీర్తులవెలయువాఁడు
కఠినమగుహస్తతలములుఁగడుమృదుత్వ, చరణములుగల్గుమనుజుఁడైశ్వర్యయుతుఁడు.

గీ. చారుచరితసాముద్రికశాస్త్రమందు, నిట్టిలక్షణములుచాలనన్నఁబడియెఁ
గానబుధులునిఁగనుఁగొన్నగానవచ్చుఁ, బండితులపనవాగజభాగ్యగతుల. 100

వ. శ్రీమన్నారాయణాంశోదయుండైన యిన్ద్రజసమానుని శరీరంబునఁబెట్టినంటినుశ
లక్షణంబు లనేకంబులున్నయవిగావున నితండుమహాభాగ్యవంతుండునుసకలదిగంత
విశ్రాంతకీర్తివంతుండును విద్యావినయసంపన్నుండును సంశవర్ధనుండును నై కలియు
గాదిమ ప్రభుత్వ సింహాసనాసీనుండై సామంత భూపతులు తనపంపుసేయఁగృత
యుగలక్షణంబున ధర్మంబు చతుష్పాదపూర్ణప్రశస్తినంబు గానసుంధరాచక్రంబ నేక
సంవత్సరంబు లశాత్రవంబు గాఁబాలింపంగలవాఁడును భగవత్స్వరూపుండవునాది
గర్భేశ్వరుండవు బ్రహ్మజ్ఞాననిధివి నగు నీవలన జన్మించి తనయుండుత్తమపురుషుఁ
డగుట స్వాభావికంబకదా యని పలికినఁ గందర్పనందనుండు మందహాసముఖుండై
మునిపుంగవున కిట్లనియె. 101

క. మీ యాశీర్వచనంబులు, మా యందనుగతములగుటమాకుఁగాసకల
శ్రేయోగుణసంపాద్యము, సేయుటకునిదానమగుటసిద్ధముకాదే. 102

క. అనిసాంత్వనవచనంబుల, ననురాగమొనర్చుచున్న యానిరుద్ధవిభుఁగాఁ
గనరయోక్తులదీవించుమఁ, జనియెన్నారదుఁడుదివికిజగతీనాథా. 103

సీ. సరససంగీతంబుసంయుతాసంయుతా హస్తాభి నయముభావాభిరామ
వీక్షణభూవిలతావిభ్రమంబుసపాద తతాళకల్పితతాళమాన
మైనలాస్యంబుకాత్యాయనియొద్ద బాణాసురతనయదానభ్యసించె

నదిగాన ద్వారకయందుఁ దద్విద్యాభిలాషఁ బ్రార్థించుచిలాసినులకు
దృఢముగావించెసౌరాష్ట్రదేశసీచంద్ర, పదనలానీలవేణులనలనేర్చి
రాలతాంగులు దెలుపనంతంతకఖిల, దేశములసర్వజనపచస్థితినివెలసె. 104

సీ. తనకీర్తిచంద్రికాతతినిండి కృష్ణపక్షంబులు శుక్లపక్షములుసేయఁ
దనదురాజత్వమింపునసార్వ కాలంబునందునుగువలయానందమొసఁగఁ
దనకరంబులుజడత్వమునను భువనప్రజానురాగంబులునై వెలుంగఁ
దనపత్తనంబుమిత్రసమాగమంబున సంపూర్ణకళలచేఁ బెంపువడయఁ
తే. దనవిలాసంబఖండసౌందర్యమహిమ, నిష్కళంకస్వభావమైనివ్వటిలఁగఁ
జంద్రునకుఁ జంద్రుఁడనఁదగుసద్గుణముల, చేతననిరుద్ధుఁడాజగత్ప్రసిద్ధుఁడయ్యె.

వ. ఇవ్విధంబున నమ్మహానుభావుండైన యనిరుద్ధుండు మహాదైశ్వర్య సమృద్ధుండును సకల భోగానుభవసిద్ధుండును వేదోక్తకర్మానుష్ఠాన పరిశుద్ధుండునునై సంసారబద్ధుండునుంబోలియుండెనిర్గుణంబును నిశ్చలంబును నిరుపమానందంబునునైనపరబ్రహ్మంబద్వితీయంబయ్యును బహునామరూపంబులఁబోలుచుఁ జరాచరంబులయందు జీవాత్మయుండైప్రాసలలోచారంబుకైవడిఁ బ్రవర్తించుచుఁ దత్కర్మానుగుణంబులై శరీరంబులకు ననుభవంబులగు సుఖాసుఖంబులబొరయక జపాకుసుమసాంగత్యంబున స్ఫటికంబు స్వచ్ఛధవళంబయ్యునుమిథ్యారక్తవర్ణంబైన తెఱంగున లిప్తుండునుంబోలె నజ్ఞుల హృదయంబులకుఁ దోఁచుచుండుననియు జ్ఞానసిద్ధిలేమిం జేసి దేహి కర్మావృతుండై తనస్వరూపంబుఁ దానతెలియనేరక తానన్యుండని యహంకారమమకారంబులంబొంది బద్ధుం డగుననియును నిద్రాకాలంబున స్వప్నలబ్ధంబైన సంచారాదులునిద్ర మేల్కనినయప్పుడు మిథ్యలై తెలియంబడినయట్లు జ్ఞానవంతుఁడైన యప్పుడుతనధావంతంబు నిస్సారంబని యాత్మయందు భేదబుద్ధిలేక సర్వసమత్వంబున సర్వంబును బ్రహ్మమయంబు ప్రపంచంబస్థిరంబనితలంచి బ్రహ్మోపాహంబను వేదాంతసారవచనార్థంబు కేవలదృఢంబుగావించియొలుకగలిగినపురుషుండు తానై సాయుజ్యసిద్ధుండగుననియు నిశ్చయించి యాత్మానుసంధానంబు సేయుచు జనకునికైవడి నాత్మజ్ఞానియై సుఖంబులనుభవించుచుండె నని పలికి మఱియు నిట్లనియె.

శా. నీలాభంబునువర్తులాకృతియుఁ జిహ్వాభూతరాజీవపు
ష్పాలంకారముపార్శ్వచక్రముత్రిరేఖాంచన్ముఖోపాంతమై
సాలగ్రామసమాకృతింబొడమిపూజల్ గాంచియిచ్చుంగృపా
శీలుండై యనిరుద్ధమూర్తిసకలశ్రీలుంబుధశ్రేణికిన్. 107

క. ధారుణిలోపలశ్రీమ, న్నారాయణునంశఁబొడమినయగుణములఁ బెం
పారననిరుద్ధనామము, సారంబనితలఁచునతఁడుసౌఖ్యముఁ గాంచున్. 108

వ. అనియు నమ్మహాపురుషగుణంబులు గొనియాడి శుకయోగి పరిక్షిన్నృపాలున కిట్లనియె. 109

క. జననాథయిట్లు నాచే, వినిపింపఁగఁబడినరసవివేకనిధానం
బనిరుద్ధచరిత్రము ప్రా, సినఁజదివినవినినరుని జెందుశుభంబుల్. 110

చ. అనివివరించినన్ముదితుఁడయ్యెధరావరుఁడంచుసూతుఁడిం
పొనరఁగశౌనకాదులగుయోగివరేణ్యులతోడఁదెల్పినన్
జనితఘనప్రమోదరససంభృతమానసులై ప్రియంబునన్
వినుతులుచేసిరక్కథకు వేమఱు మత్క్షితిరాజ్యనాయకా. 111

క ఈయనిరుద్ధచరిత్రము, శ్రేయస్కరమగుచుసుజనజిహ్వాగ్రములన్
బాయక యాచంద్రార్క, స్థాయియగుచుసు ప్రసిద్ధిఁదనరుంగాతన్. 112

మ. శయనీభూతభుజంగసంగరజయశ్లాఘానిరాఘాటధై
ర్యదయుత్తోత్తుంగవిహంగపుంగవతురంగాగూఢదివ్యాంగపా
దయుగారాధకగోత్రభంగనిగమాంతజ్ఞానశుద్ధాంతరం
గయతివ్రాతముఖాబ్జసూతనపతంగామంగళాధీశ్వరా. 113

క. క్రేంకారకింకిణీయుత, టంకారజ్యాలతానటచ్చాపజితో
ద్ధుంకారసముఖవీరా, హుంకారాసకలభూషణాలంకారా. 114

తోటకవృత్తము.

మన్మథకోటిసమానవిలాసా, సన్ముఖనిర్జితచంద్రవికాసా
చిన్మయరూపవిశిష్టనివాసా, జన్మమయాపహసద్గుణభాసా. 115

గద్య. ఇది శ్రీమంగళాచల నృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తి రాయనమంత్రితనూభవ సుజనహిత కృత్యనిత్యా బ్బయామాత్యప్రణీతంబైన యనిరుద్ధచరిత్రం బను మహాప్రబంధమునందు సర్వంబును బంచమాశ్వాసము సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. — 1924.

# ఆంధ్రగ్రంథములు.

## వచనగ్రంథములు.

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు,ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 4 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 4 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 4 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 5 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు | (అచ్చు) | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| అరేబియన్నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారణ, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసురామాయణము | 12 | 0 |
| తిలకుగారినెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |
| ద్వాదశోపనిషత్తులు, వచనం | అచ్చు | |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 8 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 12 |
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 8 |
| నీతిరత్నాకరము | 0 | 12 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| సంగ్రహభారతము | 1 | 8 |
| సంగ్రహభాగవతము | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | అచ్చు | |
| పతివ్రతలచరిత్రలు | 2 | 8 |
| దక్కనుపూర్వకథలు | 2 | 8 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| దశకుమారచరిత్రము | 2 | 0 |
| మదనకామరాజుకథలు, | 0 | 14 |

## పద్యకావ్యములు.

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 1 | 8 |
| *అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | .... | 0 | 10 |
| * అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారివిమర్శతో నున్నది | | 5 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 6 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకుముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | | (అచ్చు) | |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది, సభాపర్వములుంగల సంపుటము | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | అచ్చు | |
| శాంతిపర్వము | ... | ,, | |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక,స్వర్గారోహణపర్వములుంగల సంపుటము | ... | 4 | 0 |
| * కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) | ... | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 8 |
| * కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | ... | 0 | 12 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనితూర్పు | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | .... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము | ... | 0 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.